శ్రీ

# బిల్హణచరిత్రమ్.



అలం కమలజన్మనా,
కమలలోచనే నాప్యలం,
మనోభవవిరోధినా
విషమలోచనే నాప్యలం,
ప్రతిక్షణవిజృమ్భణా
దుభయబాహుకూలఙ్కష
స్తనత్రుటితకఞ్చుకం
నమత యౌవనం యోషితామ్.

౧. కమల జన్మనా = కమలమునుండి పుట్టుకగలవాఁడైన బ్రహ్మదేవుఁడు, అలమ్ = అక్కఱలేదు, కమలలోచనేన అపి = కమలముల వంటి నేత్రములు గలవాఁడైన విష్ణువుకూడ, అలమ్ = అక్కఱలేదు, మనోభవ విరోధినా = మన్మథునికి శత్రువయిన, విషమః లోచనేన అపి = బేసి కన్నులవాఁడు (శివుఁడు) కూడ, అలమ్ = అక్కఱలేదు; ప్రతిక్షణ విజృమ్భణాత్ = ప్రతిదినమునందును విఱ్ఱవీఁగుటచేత, ఉభయ బాహు కూల జ్కష స్తన త్రుటిత కఞ్చుకం = రెండు భుజముల గట్టుల నొరసికొనుచున్న కుచములచేత పిగిలిన ఱవికగలదైన, యోషితామ్ = స్త్రీలయొక్క, యౌవనమ్ = ప్రాయమునకు, నమత = మ్రొక్కుఁడు.

పృథ్వీమణ్డలనాభిభూత మమరాణా
ముత్తరే శాలయం

ప్రాయఃకోవిదసాధురాజిమహితే
పఞ్చాలదేశేఽభవత్
లక్ష్మీమన్దిరనామకం పురవరం
నానాసుఖైకాస్పదం;
తత్రాసీన్మదనాభిరామనృపతి
ర్భూపాలచూడామణిః.

౨. పృథ్వీ మణ్డల నాభి భూతమ్ అమరాణామ్ ఆలయమ్ ఉత్తరేణ=భూ వలయమునకు బొడ్డు అయిన దేవతల నివాసమునకు (మేరువునకు) ఉత్తరమందు, ప్రాయః కోవిద సాధు రాజి మహితే = విశేషముగా పండితులయిన సజ్జనుల సమూహముచే పూజితమైన, పఞ్చాల దేశే = పంచాలమను దేశమునందు, లక్ష్మీమన్దిర నామకమ్ = లక్ష్మీమందిరము అను పేరుగలదైన, పురవరమ్ = ఉత్తమనగరము, నానా సుఖ ఏక ఆస్పదమ్ = సకల భోగములకును ముఖ్యస్థానమయినది, అభవత్ = ఉండెను; తత్ర = ఆనగరమందు, భూపాల చూడామణిః=రాజ శ్రేష్ఠుఁడైన, మదనాభిరామ నృపతిః = మదనాభిరాముఁడు అను రాజు, ఆసీత్ = ఉండెను.

మన్దారమాలా తస్యాసీన్మహిషీ సుగుణా; తయోః
యామినీపూర్ణతిలకా తనయా వినయాన్వితా.

3. తస్య=అతనికి, సుగుణా = మంచిగుణములుగలదైన, మన్దారమాలా=మందారమాలయను నామె, మహిషీ=పట్టపుదేవియై, ఆసీత్ = ఉండెను, తయోః=ఆయిరువురికి, వినయ అన్వితా = వినయముతోఁ గూడుకొన్నదైన (అనఁగా వినయవంతురాలయిన), యామినీపూర్ణతిలకా=యామినీపూర్ణతిలక (యని), తనయ = కూఁతురు (కలదు).

ఆసీత్ సా నవయౌవనా మధురవా
క్సౌభాగ్యభాగ్యోదయా

కర్ణాన్తాయతలోచనాఽతిచతురా
ప్రాగల్భ్యగర్వాన్వితా
రమ్యా బాలమరాళమన్థరగతి
ర్మత్తేభకుమ్భస్తనీ
బిమ్బోష్ఠీ పరిపూర్ణచన్ద్రవదనా
భృఙ్గాళినీలాలకా.

ర. సా=ఆకూఁతురు, నవ యౌవనా=క్రొత్త యౌవనముగలదై, మధుర వాక్ సౌభాగ్య భాగ్య ఉదయా=తీయని పలుకుల సొంపుయొక్క భాగ్యముయొక్క ఉత్పత్తికలదియు, కర్ణ అన్త ఆయత లోచనా=చెవుల తుదలవఱకు వ్యాపించిన నేత్రములు కలదియు, అతిచతురా=మిగుల నేర్పరియు, ప్రాగల్భ్య గర్వ అన్వితా = తెలివియొక్క గర్వముతో కూడుకొన్నదియు, రమ్యా=మనోహరమయినదియు, బాల మరాళ మన్థర గతిః = లేత హంసవలె నింపాదియైన నడకగలదియు, మత్త ఇభ కుమ్భస్తనీ = మదించిన యేనుఁగుయొక్క కుంభస్థలమువంటి కుచములు గలదియు, బిమ్బ ఓష్ఠీ = దొండ పండువంటి పెదవిగలదియు, పరిపూర్ణ చన్ద్ర వదనా = నిండు చందురునివంటి ముఖముగలదియు, భృఙ్గ ఆళి నీల అలకా = తుమ్మెదల పంక్తివంటి నల్లని కురులుగలదియుఁగా, ఆసీత్=ఉండెను.

దృష్ట్వా తాం మదనాభిరామనృపతిః
పుత్త్రీం పవిత్రస్వరాం
సంగీతామ్బునిధేః సుధాకరకలాం
సాహిత్యహీనాం తదా
'కావ్యాలంకృతినాటకాదినిపుణా
కార్యా మయే'తి ధ్రువం

నిశ్చిత్యాశు పరం ప్రధానసచివం
పప్రచ్ఛ కార్యక్రమమ్.

౫. తదా=అప్పుడు, మదనాభిరామనృపతిః = మదనాభిరామరాజు, పవిత్ర స్వరామ్ = శుద్ధమయిన స్వరముగలదానిని, సంగీత అమ్బునిధేః = సంగీతమనెడు సముద్రమునకు, సుధాకర కలామ్ = చంద్రరేఖయైన దానిని, సాహిత్య హీనామ్ = కావ్యశాస్త్రవిజ్ఞానముచే కొఱవడినదానిని, పుత్రీమ్ = తనకొమరితను, దృష్ట్వా = చూచి, మయా=నాచేత, కావ్య అలంకృతి నాటక ఆది నిపుణా = కావ్యములు అలంకారశాస్త్రము నాటకములు మొదలగువానియందు నేర్పుగలదిగా, కార్యా = చేయఁబడవలసినది, ఇతి = ఇట్లని, ధ్రువం=దృఢముగా, నిశ్చిత్య = నిశ్చయించుకొని, ఆశు = వెంటనే, ప్రధానసచివం = ముఖ్యమంత్రిని, పరం కార్య క్రమమ్ = అటుపై చేయవలసిన పద్ధతిని, పప్రచ్ఛ = (ఇట్లు) అడిగెను.

రాజు అడుగుచున్నాఁడు.—

యామినీపూర్ణతిలకా
సంగీతనిపుణా కృతా ;
సాహిత్యవిద్యా త్వభ్యస్యా
యువత్యా ప్రౌఢయా తయా.

౬. యా...కా= యామినీపూర్ణతిలక, సంగీత నిపుణా = సంగీతమందు నేర్పరి, కృతా = చేయఁబడినది, (కింతు=మఱి) ప్రౌఢయా యువత్యా తయా=ఎదిగిన వయసుదియైన దానిచేత, సాహిత్య విద్యా అభ్యస్యా=కావ్యాలంకారాది విద్య నేర్వఁబడవలసినది.

ముఖ మఖిలం నయనయుగం,
నక్షుః సర్వం పయోధరద్వన్ద్వం;
మధ్య మశేషం గగనం,
తస్యాః శిక్షావిధౌ సమర్థః కః ?

౭. (ఆమెకు) ముఖమ్ అఖిలం = ముఖము అంతయు, నయన యుగం = నేత్ర ద్వయము (కన్నులు గొప్పవి యనుట), వక్షః సర్వం = హృదయము అంతయు, పయోధర ద్వన్ద్వమ్=చను దోయి (చనుదోయి గొప్పది యనుట), మధ్యమ్ అశేషం = నడుము అంతయు, గగనం = ఆకాశము, (నడుము అతిసూక్ష్మము అనుట), తస్యాః = అంత యందగత్తెయయిన నాకుమారికి, శిక్షా విధౌ=విద్య నేర్పుటకు, కః=ఎవఁడు, సమర్థః=శక్తుఁడు? (ఎట్టివాఁ డయినను ఆమెసౌందర్యమును చూచి కామమోహితుఁ డగును, అనర్థము సంభవించును అని తా.)

మంత్రి చెప్పుచున్నాఁడు.

దేవాత్ర నగరే సన్తి
బహవః పణ్డితా ద్విజాః
తానాకార్యాధునా సర్వాన్
పరీక్షా క్రియతాం పరమ్.

౮. దేవ=రాజా, అత్ర నగరే= ఈ పురమందు, పణ్డితాః ద్విజాః = విద్వాంసులగు బ్రాహ్మణులు, బహవః = అనేకులు, సన్తి = కలరు. అధునా = ఇప్పుడు, తాన్ సర్వాన్ = వారి నందఱను, ఆకార్య = పిలిపించి, పరం=చక్కఁగా, పరీక్షా క్రియతామ్ = పరీక్ష చేయఁబడును గాక.

తథైవ భూయా దితి సర్వశాస్త్ర
విశారదాం శ్చారుచరిత్రయుక్తాన్
ఆకార్య సర్వాన్ విబుధాన్ నరేశః
పప్రచ్ఛ తాం స్తత్తదధీతవిద్యాః.

౯. తథా ఏవ భూయాత్ ఇతి = అట్లే అగును గాక అని, నరేన్ద్రః=రాజు, సర్వ శాస్త్ర విశారదాన్=సకల శాస్త్రములందు ప్రవీణులును, చారు చరిత్ర యుక్తాన్=మంచి నడవడిగలవాఁ రైనవారిని

న్నవారును, (అయిన) సర్వాన్ విబుధాన్=అందఱు పండితులను, ఆకార్య = పిలిపించి, తాన్ = వారిని, తత్ తత్ అధీత విద్యాః = వారు వారు చదివిన విద్యలను, పప్రచ్ఛ=అడిగెను.

పెద్దలు చెప్పుచున్నారు.—

తర్కే- వ్యాకరణే పురాణనిచయే
వేదాన్తశాస్త్రేఽఖిలే
వేదే తత్పద పాఠ తత్క్రమ జటాఽ
రోహావరోహేషు చ
కల్పే కర్మణి భవ్య బోధ బహు వా
ద ప్రౌఢి యోగేషు వా
నిష్ణాతా వయ మిత్యుదారమతయ
స్తం ప్రోచు రుర్వీసురాః.

౧౦. తర్కే...వేదే = తర్కములో వ్యాకరణములో పురాణ సమూహములో వేదాంత శాస్త్రములో సమస్తమయిన వేదముల లో, తత్...షు చ=వాని పదవిభాగము పాఠము వానిక్రమము జట పైకిఁజెప్పుట క్రిందికిఁజెప్పుట—వీనియందును, కల్పే కర్మణి = కల్పసూత్రములయందును వేదచోదితకర్మలను చేయుటయందును, భవ్య...షు చ = ఉత్తమమయిన జ్ఞానముగల అనేక వాదములయం దలి దార్ఢ్య సంబంధములలోను, వయం నిష్ణాతాః ఇతి = మేము ని పుణులము అని, ఉదార మతయః=గొప్ప బుద్ధిగల, ఉర్వీసురాః = బ్రాహ్మణులు, తం=ఆమదనాభిరామనృపతితో, ప్రోచుః=పలికిరి.

'బుధా,యూయం సర్వే నను మమ సుతాం కావ్యనిపు
రసాలంకారజ్ఞాం కురుత నితరాం ప్రీతమనసః.' (రాజు
'రసజ్ఞా నైవ స్మో వయ, ముత రసజ్ఞా స్తు కవయః.'
'కవిత్వం కిం నాస్తి?' 'ప్రవిశతి కథం ఛాన్దసకులే?'

౧౧. రాజు.—నను బుధాః=ఓపండితులారా, యూయం సర్వే =మీరు అందఱు, ప్రీత మనసః=సంతోషించిన మనస్సుగలవారై, మమ సుతాం=నా కుమారిని, కావ్య నిపుణాం = కావ్యములలో ప్రవీణురాలినిగా, రస అలంకార జ్ఞాం = రసము అలంకారములు ఎఱిఁగిన దానినిగా, నితరాం=చక్కఁగా, కురుత=చేయుఁడు.

పండితులు.—వయం = మేము, రస జ్ఞాః = రసము ఎఱిఁగినవారము, న ఏవ స్మః = కానే కాము, ఉత=మఱి, కవయః తు = కవులు అయిననో, రసజ్ఞాః=రసికులు.

రాజు.—కవిత్వం కిం నాస్తి = కవిత్వము (మీకు) ఏల లేదు?

పండితులు.—ఛాన్దస కులే = వైదికుల సమూహములో, కథం ప్రవిశతి=(కవనము) ఎట్లు ప్రవేశించును.

'నైవ వ్యాకరణజ్ఞ మేతి పితరం,
　న భ్రాతరం తార్కికం,
దూరాత్ సంకుచి తైవ గచ్ఛతి యథా
　చణ్డాలత శ్ఛాన్దసాత్,
మీమాంసానిపుణం నపుంసక ఇతి
　జ్ఞాత్వా నిర స్యాదరాత్
కావ్యాలంకరణజ్ఞ మేవ కవితా
　కన్యా వృణీతే స్వయమ్.

౧౨. కవితా కన్యా=కవితా కన్య, పితరం=తండ్రియయిన, వ్యాకరణ జ్ఞం=వైయాకరణుని, న ఏవ ఏతి=పొందనే పొందదు, భ్రాతరం తార్కికం=అన్నయయిన తార్కికుని, న=పొందదు, చణ్డాలతః యథా=చండాలునినుండియుంబోలె, ఛాన్దసాత్ = వైదికునినుండి, దూరాత్=దూరముగా, సంకుచితా ఏవ గచ్ఛతి = ముణుఁచుకొన్నదియై యే పోవును, మీమాంసా నిపుణం=మీమాంసా శాస్త్రజ్ఞుని,

నపుంసక ఇతి=నపుంసకుఁడు అని, జ్ఞాత్వా = ఎఱిఁగి, నిరస్య = తిరస్కరించి, కావ్య అలంకరణ జ్ఞమ్ ఏవ = కావ్యములు అలంకారములు ఎఱిఁగినవాని నే, స్వయమ్=తనంతటతానే, ఆదరాత్ = ప్రీతితో, వృణీతే=వరించును.

వ్యాకరణమువలన శబ్దములు పుట్టును గావున వైయాకరణుఁడు కవితకు తండ్రి, తర్కము యుక్తాయుక్తములు చెప్పునుగాన తార్కికుఁడు అన్న, వేదవిద్య శృంగారాదివిరుద్ధమగుటచే వైదికుఁడు దూరగతుఁడు, మీమాంస కర్మనే స్థాపించుచు రసజ్ఞత కవకాశ మీదుగాన మీమాంసకుఁడు నపుంసకుఁడు, కావ్యాలంకరణజ్ఞుఁడు రసజ్ఞుఁడుగాన వాఁడే ప్రియుఁడు.

రాజు అడుగుచున్నాఁడు. —

'రసాలంకారనిపుణో నవ్యకావ్యవిచక్షణః
ఛన్దోనాటకతత్త్వజ్ఞః కో వా కవి రుదీర్యతామ్?'

౧౩. రస అలంకార నిపుణః = రసములలో । అలంకారములలో ప్రవీణుఁడును, నవ్య కావ్య విచక్షణః = క్రొత్త కావ్యమును చెప్పువాఁడును, ఛన్దస్ నాటక తత్త్వ జ్ఞః = ఛందస్సుయొక్కయు నాటకములయు స్వరూపమును ఎఱిఁగినవాఁడును, (అగు), కవిః=కవి, కః వా = ఎవఁడో, ఉదీర్యతామ్=చెప్పఁబడును గాక.

పెద్దలు చెప్పుచున్నారు.—

బిల్హణో మల్హణ శ్చేతి ద్వా వేతౌ సరసౌ కవీ.
తయో స్తు బిల్హణో నామ కవిరాట్ కథ్యతే బుధైః.

౧౪. దం.—బిల్హణుఁడు మల్హణుఁడు అని ఇద్దఱు వీరు రసికులయిన కవులు, వారిలో నయిననో బిల్హణుఁడు అనువాఁడు కవిరాజని చెప్పఁబడుచున్నాఁడు పెద్దలచేత.

వాసః శుభ్ర, మృతు ర్వస న్తసమయః,
పుష్పం శర న్మల్లికా,

ధానుష్కః కుసుమాయుధః, పరిమళః
కాస్తూరికో, ఽస్త్రం ధనుః,
వాణీ తర్కరసోజ్జ్వలా, ప్రియతమా
శ్యామా, వయో యౌవనం,
మార్గః శంకర ఏవ, పఞ్చమలయా
గీతిః, కవి బిల్హణః.

౧౪. శుభ్రమ్ ఏవ వాసః = తెల్లని దే వస్త్రము (వస్త్రములలో తెల్లనిది శ్రేష్ఠమని భావము, ఇట్లే కడమవాక్యములలోను శ్రేష్ఠతను ఊహించుకొనవలయును.) వసన్తసమయః ఏవ ఋతుః = వసంతకాల మే ఋతువు, శరత్ మల్లికా, ఏవ పుష్పమ్ = శరత్కాలపు మల్లె యే పువ్వు, కుసుమాయుధః ఏవ ధానుష్కః = మన్మథుఁడే విలుకాఁడు, కాస్తూరికః ఏవ పరిమళః = కస్తూరి దే సుగంధము, ధనుః ఏవ అస్త్రమ్ = విల్లే ఆయుధము, తర్కరస ఉజ్జ్వలా ఏవ వాణీ=తర్కరసముచే ప్రకాశించున దే వాక్కు, శ్యామా ఏవ ప్రియతమా = యౌవనమధ్యస్థ యే ప్రియురాలు, యౌవనమ్ ఏవ వయః=యౌవన మే వయస్సు, శంకర ఏవ మార్గః = శంకరుఁ డే గతి, పఞ్చమలయా ఏవ గీతిః = పంచమ లయగల దే పాట, బిల్హణః ఏవ కవిః = బిల్హణుఁ డే కవి.

"స దృష్టపూర్వో నాస్మాభిః కుత్రాస్తే?" "త్రైవ తిష్ఠతి."
"త మిహాహ్వాయ తేఽత్యుక్తే సమాహూతః స బిల్హణః.

౧౫. రాజు.—సః అస్మాభిః దృష్టపూర్వః న = అతఁడు మాచేత ఇదివఱకు చూడఁబడినవాఁడు కాఁడు, కుత్ర ఆస్తే = ఎక్కడ ఉన్నాఁడు?

పెద్దలు.—అత్ర ఏవ తిష్ఠతి = ఇచట నే (ఈపురముందే) ఉన్నాఁడు.

రాజు.—తమ్ ఇహ ఆహ్వాయత = అతనిని ఇచటికి పిలువుఁడు.

ఇతి ఉక్తే (సతి)=ఇట్లు (రాజుచే) చెప్పఁబడఁగా (ఇట్లు రాజుచెప్పఁగా), సః బిల్హణః సమాహూతః=ఆ బిల్హణుఁడు పిలువఁబడెను.

ఆగత్య సన్ బిల్హణనామధేయః
కవిః సుధర్మాఖ్యసభాం ప్రవిశ్య
దదౌ సురేశస్య గురు ర్యథాశిషం
పరాం తథా తస్య మహాన్ మహీపతేః.

౧౭. మహాన్ సన్=గొప్ప పండితుఁడయిన, బిల్హణనామధేయః కవిః=బిల్హణుఁడను పేరుగల కవి, ఆగత్య=వచ్చి, గురుః = బృహస్పతి, సుధర్మాఖ్యసభాం ప్రవిశ్య = సుధర్మయను పేరిసభను (దేవసభను) చొచ్చి, సురేశస్య యథా తథా=ఇంద్రునికి ఎట్లో అట్లు, తస్య మహీపతేః = ఆ రాజునకు, పరామ్ ఆశిషమ్ = ఉత్కృష్టమయిన ఆశీర్వాదమును, దదౌ = ఇచ్చెను.

"విద్వద్రాజశిఖామణే, సుఖ?" "మహా
సౌఖ్యం ప్రసాదా త్తవ."
"త్వత్ప్రఖ్యాతి రమీభి రేవ కథితా
నాస్మాభి రాలోకితా.
కుత్రత్య స్త్వ ముదీర్యతాం కవివ" "నే
యత్కాల మస్మిన్ పురే
సన్ విద్యాభ్యసనేన మోద మభజం,
త్వా మద్య సందృష్టవాన్."

౧౮. రాజు.—విద్వద్రాజశిఖామణే సుఖమ్ = ఓపండితరాజశ్రేష్ఠుఁడా క్షేమమా?

కవి.—అహో తవ ప్రసాదాత్ సౌఖ్యం = ఆహా నీదయచేత క్షేమము.

రాజు.—త్వత్ ప్రఖ్యాతిః అమీభిః ఏవ కథితా న అస్మాభిః ఆలోకితా = నీ కీర్తి వీరిచేత నే చెప్పఁబడినది మాచేత చూడఁబడలేదు, కవివర త్వం కుత్రత్యః ఉదీర్యతామ్ = కవిశ్రేష్ఠుఁడా నీవు ఎక్కడివాఁడవో చెప్పఁబడునుగాక.

కవి.—ఇయత్ కాలమ్ = ఇంత కాలము, అస్మిన్ పురే = ఈపురమందు, సన్ = ఉండి, విద్యాభ్యసనేన=విద్యాభ్యాసముచేత, మోదమ్ అభజమ్ = సంతోషమును పొందితిని, అద్య త్వాం సందృష్టవాన్ = ఇప్పుడు నిన్ను చూచితిని.

తదా నరేశః కవిపుఙ్గవాయ
కేయూరహారాదిసమస్తభూషాః
దుకూలవస్త్రద్రవిణాని కామం
దత్త్వోచితం ప్రేషితవాన్ గృహాయ.

౧౫. తదా = అపుడు, నరేశః = రాజు, కామమ్ = సమృద్ధిగా, ఉచితం = తగినట్లుగా, కవిపుఙ్గవాయ = కవిశ్రేష్ఠుఁడైన బిల్హాణునికి, కేయూర హార ఆది సమస్త భూషాః = బాహుపురులు ముత్యాలపేరులు మొదలయిన సకలమయిన యాభరణములను, దుకూల వస్త్ర ద్రవిణాని = తెల్లపట్టు వస్త్రములు ధనములును, దత్త్వా = ఇచ్చి, గృహాయ = ఇంటికి, ప్రేషితవాన్ = పంపివేసెను.

రాజు మంత్రితో చెప్పుచున్నాఁడు.—

ఆకారే మదనః, సుకావ్యరచనా
చాతుర్యయుక్త్యాం గురుః,
షడ్భాషామపి దృశ్యతే వ్యసనితా,
తం దృష్టవత్యః స్త్రియః
స్వప్రాణేశ్వరసంగమం సుఖతరం
త్యక్త్వా న జీవ న్త్యహో!



తస్యాన్తే క్రియతేఽధునా తనయయా
భ్యాసః కలానాం కథమ్ ?

౨౦. ఆకారే మదనః = (ఈబిల్హణుఁడు) స్వరూపములో మన్మథుఁడు, సు కావ్య రచనా చాతుర్య యుక్త్యాం గురుః = మంచి కావ్యములను రచియించుటయందలి నేర్పుతో సంబంధమందు బృహస్పతి, షడ్భాషాస్వమ్ అపి వ్యసనితా దృశ్యతే = ఆఱుభాషలయందు కూడ పరిచయము అగపడుచున్నది, తం దృష్టవత్యః స్త్రియః = అతనిని చూచిన స్త్రీలు, సుఖతరం = మిక్కిలి సుఖకరమైనను, స్వప్రాణేశ్వర సంగమం = తమ ప్రాణనాథుల సాంగత్యమును, త్యక్త్వా =వదలి, న జీవన్తి = బ్రదుకిరు (అనఁగా ఇతనికై ప్రాణమును వదలుదురు), అహో = ఆశ్చర్యము, తస్య అన్తే = ఇతని యొద్ద, అధునా =ఇప్పుడు, తనయయా = (నా) కుమారిచేత, కలానామ్ అభ్యాసః= విద్యలను నేర్చుట, కథం క్రియతే = ఎట్లు చేయఁబడును (అనఁగా వీనియొద్ద చదువు జరుగదు, మఱియేమనిన నాకూఁతురు వీనిని కామించి చెడిపోవును.)

ధరణీకల్పవృక్షస్య తస్య లావణ్యమఞ్జరీ
ఆకర్షత్యాయతాక్షీణా మన్తఃకరణషట్పదాన్.

౨౧. ధరణీ కల్పవృక్షస్య = భూలోకపు మందారవృక్షమయిన, తస్య = అతనియొక్క, లావణ్య మఞ్జరీ = సౌందర్యమనెడు పూలగుత్తి, ఆయత అక్షీణామ్ = విశాల నేత్రములుగల స్త్రీలయొక్క, అన్తఃకరణ షట్పదాన్ = మనస్సులనెడు తుమ్మెదలను, ఆకర్షతి = లాఁగుచున్నది.

ఏవం వదతి రాజేన్ద్రే ప్రధానం నృప మబ్రవీత్. —
"తథాపి శాస్త్రాభ్యాసోఽస్యా విధేయో నను భూపతే."

౨౨. ఏవమ్ = ఇట్లు, రాజేన్ద్రే వదతి (సతి) = రాజశ్రేష్ఠుఁడు చెప్పఁగా, ప్రధానం = మంత్రి, నృపమ్ = రాజుతో, అబ్రవీత్ = పలికెను:—

మంత్రి.—తథా అపి = అట్లయినను, భూపతే = రాజా, అస్యాః = ఈమెకు, శాస్త్రాభ్యాసః విధేయః నను = శాస్త్రాభ్యాసము చేయవలసినది గదా.

రాజు అడుగుచున్నాఁడు.—

ఏనం వినా న కోఽప్యస్తి మద్దేశే సరసః కవిః।
కిం కుర్మః? కపటోపాయః కథ్యతాం నీతికోవిద.

౨౩. మత్ దేశే ఏనమ్ వినా కః అపి సరసః కవిః నాస్తి = నా దేశములో ఇతఁడు తప్ప ఎవఁడును రసికుఁడయిన కవి లేఁడు, కిం కుర్మః = ఏమి చేయుదుము, నీతి కోవిద = నీతి నిపుణుఁడా, కపటః ఉపాయః కథ్యతామ్ = కపటమయిన యుపాయము చెప్పఁబడును గాక (ఉపాయము చెప్పుము అనుట).

మంత్రి పలుకుచున్నాఁడు.—

తయో ర్వ్రతద్వయమిహాస్తి నాన్ధ
ముఖావలోకం కురుతే కుమారీ।
స బిల్హణః కుష్ఠిశరీరదర్శనం
న జాతు కుర్యాదితి చ శ్రుతం విభో.

౨౪. విభో = ఓ ప్రభూ, తయోః వ్రతద్వయమ్ ఇహ అస్తి = వారిరువురకు వ్రతములు రెండు ఇచట కలవు, కుమారీ అన్ధ ముఖ అవలోకం న కురుతే = అమ్మాయి గ్రుడ్డివాని ముఖమును చూచుటను చేయదు (చూడదు), సః బిల్హణః కుష్ఠ శరీర దర్శనం జాతు న కుర్యాత్ ఇతి చ = ఆ బిల్హణుఁడు కుష్ఠ దేహిని చూచుటను ఎప్పుడును చేయఁడు అనియు (ఎప్పుడును చూడఁడు అనియు), శ్రుతమ్ = వినఁబడి యున్నది.

'పుత్త్రి కుష్ఠగ దేతి బిల్హణకవే
రాచక్ష్వ. తస్యాః కవిం
జాత్యన్ధం ప్రతిపాదయస్వ నితరాం
శ్రుత్వా వచ స్తత్ తవ
సర్వం విశ్వసతో స్తయో ర్వద పున
ర్మధ్యే హి దృగ్రోధకం
బద్ధ్వా కాణ్డపటం దధామి, పరతో౽
భ్యాసో భవ త్వి' త్యపి.

౨౫. పుత్త్రి = (నీ) కొమారిత, కుష్ఠ గదా ఇతి = కుష్ఠ రోగిణి అని, బిల్హణకవేః ఆచక్ష్వ=బిల్హణకవికి చెప్పుము, తస్యాః=ఆమెకు, కవిం నితరాం జాత్యన్ధం ప్రతిపాదయస్వ = కవిని మిక్కిలి పుట్టుగ్రుడ్డినిగా తెలుపుము, తవ తత్ వచః శ్రుత్వా = నీదైన యామాటను విని, సర్వం విశ్వసతోః తయోః = సమస్తమును నమ్ముచున్న వారికి, పునః = మరల, హి = నిశ్చయముగా, మధ్యే = నడుమ, దృగ్ రోధకమ్ = కన్నులను మఱచునదియైన, కాణ్డపటం = తెరచీరను, బద్ధ్వా = కట్టి, దధామి=ఉంచెదను, పరతః అభ్యాసః భవతు ఇతి అపి = పిమ్మట చదువు జరుగునుగాక అని యును, వద = చెప్పుము.

'య దుక్తం భవతా మన్త్రిం
స్త థైవ క్రియతే౽ధునా.'
ఇ త్యు క్త్వాకారయామాస
కుమారీం కోమలాం నృపః.

౨౬. మన్త్రిన్ భవతా యత్ ఉక్తం తత్ తథా ఏవ (మయా) క్రియతే = మంత్రీ నీచే ఏమి చెప్పఁబడినదో అది అట్లే (నాచే) చేయఁబడును, ఇతి ఉక్త్వా = ఇట్లు పలికి, నృపః కోమలాం కుమారీమ్ ఆకారయామాస = రాజు కోమలమయిన కొమారితను పిలిపించెను.

ఆగత్య సా మన్మథ మన్త్రదేవతా
సమానరూపా పితు రన్తికే స్థితా.
తాం వీక్ష్య 'శాస్త్రశ్రవణం విధీయతాం
త్వయా కుమారీ' త్యవద న్నరాధిపః.

౨౭. మన్మథమన్త్రదేవతా సమానరూపా సా ఆగత్య = మన్మథుని మంత్రదేవతతో మిక్కిలి సమానురాలయిన యామినీపూర్ణతిలక వచ్చి, పితుః అన్తికే స్థితా = తండ్రి సమీపమున నిలిచినది. తాం వీక్ష్య=ఆమెను చూచి, నరాధిపః = రాజు, కుమారి త్వయా శాస్త్రశ్రవణం విధీయతామ్ ఇతి అవదత్ = అమ్మాయీ నీచే శాస్త్రము వినుట చేయంబడవలసినది (నీవు శాస్త్రములు చదువవలసినది) అని చెప్పెను.

'జాత్యన్ధో హి బుధశ్రేష్ఠో
బిల్హణాఖ్యోఽస్తి మత్పురే.
త స్యాన్తే క్రియతాం సర్వ
శాస్త్రాభ్యాస స్త్వయా సుతే.'

౨౮. రాజు.—అమ్మాయీ నాపట్టణములో బిల్హణుఁ డనుపండితోత్తముఁడు పుట్టుగ్రుడ్డి ఉన్నాఁడు, నీవు సర్వశాస్త్రములను ఆయనయొద్ద నేర్వవలసినది.

'కి మేత ! దన్ధకముఖం
న పశ్యా మీతి మే వ్రతమ్.'
'తదా చే ద్యవయో ర్మధ్యే
కాణ్డం దాస్యామి యత్నతః.'

౨౯. కొమారిత.—కిమ్ ఏతత్ = ఏమి ఇది ! అన్ధక ముఖం నపశ్యామి ఇతి మే వ్రతమ్ =గ్రుడ్డివాని ముఖమును చూడను అని నాకు వ్రతము.

రాజు.—తథా...త్నతః = అట్లు అయిన మీయిద్దఱ నడుమ తెరను ఉంచెదను యత్నముతో.

ఇత్యఙ్గీకృతవత్యాం
తస్యా మబ్రూత బిల్హణం నృపతిః,
'కుష్ఠగిదాం మత్పుత్రీం
సర్వకళాకోవిదాం విధేహీ'తి.

౩౦. ఇతి తస్యామ్ అఙ్గీకృతవత్యాం = ఇట్లు ఆమె అంగీకరింపఁగా, నృపతిః = రాజు, బిల్హణం=బిల్హణునితో, కుష్ఠగదాం మత్ పుత్రీం = కుష్ఠరోగిణియయిన నా కొమరితను, సర్వకళాకోవిదాం విధేహి ఇతి అబ్రూత = సర్వశాస్త్రజ్ఞురాలినిగా చేయుము అని చెప్పెను.

'సాధూక్తం నృపశేఖర!
కదాపి వీక్షే న కుష్ఠరోగిముఖమ్.'
'భూయా న్నామ మహాత్మన్;
మధ్యే దాస్యామి వాం తిరస్కరిణీమ్.'

౩౧. కవి.—సాధు ఉక్తం=చక్కఁగా చెప్పఁబడినది (చక్కఁగా చెప్పితివి), నృపశేఖర కుష్ఠరోగిముఖం న కదా అపి వీక్షే = రాజశ్రేష్ఠుఁడా కుష్ఠరోగిముఖమును ఎప్పుడు ను చూడను.

రాజు.—భూయాత్ నామ = ఉండును గాక, మహాత్మన్=ఓ మహానుభావుఁడా, వాం మధ్యే తిరస్కరిణీం దాస్యామి = మీ నడును తెరను ఉంచెదను.

'రాజం స్త్వయ్యేవం, నిర్బన్ధః
క్రియతే. కిం కరో మ్యహం?
తథా యది యథాశక్తి
విద్యాం దాస్యామి భూపతే.'

౩౨. కవి.—రాజా, నీవు ఇట్లు నిర్బంధము చేయుచున్నావు. ఏమి చేయుదును నేను! అశ్లీలశక్తి కొలఁది చదువు నేర్పెదను రాజా.

ఇతి తస్య వచః శ్రుత్వా
నృపః ప్రేష్య కవిం గృహం
'మన్త్రిం స్త్వ యోదితోపాయః
సిద్ధోఽభూ' దిత్యభాషత.

౩౩. ఇట్లు అతని మాటను విని రాజు పంపి కవిని ఇంటికి 'మంత్రీ, నీవు చెప్పిన యుపాయము సిద్ధించినది' అని పలికెను.

తతః సమాకార్య నిమిత్తకోవిదాన్
ముహూర్త మాలోచ్య శుభఙ్కరం వరం
విధాయ గేహం బహుచిత్రచిత్రితం
తదన్తరే కాణ్డపటం న్యబన్ధయత్.

౩౪. తతః నిమిత్తకోవిదాన్ సమాకార్య = పిమ్మట జోస్యులను పిలిచి, శుభఙ్కరం వరం ముహూర్తం సమాలోచ్య = మేలుచేయునదియైన మంచి ముహూర్తమును ఆలోచించి, గేహం బహుచిత్రచిత్రితం విధాయ = ఇంటిని నానాచిత్రములచే చిత్రింపఁబడిన దానినిగా చేసి, తదన్తరే కాణ్డపటం న్యబన్ధయత్ = దాని నడుమ తెరచీరను కట్టించెను.

తత్రాగత్య నరాధిపః శుభదినే
మాత్యాన్ కవీన్ద్రాన్ బుధాన్
దృష్ట్వా తాం స్వసుతాం చ బిల్హణకవిం
శీఘ్రం సమానాయయత్.

వాగ్దేవీపదపూజనం ప్రథమతః
కృత్వా చ రామాయణ

ప్రారమ్భం కృతవాన్ స బిల్హణకవిః
సానుగ్రహః సత్కృతః.

౩౫. దం.— అచటికి వచ్చి రాజు మంచి దినమందు మంత్రులను కవీంద్రులను పండితులను చూచి ఆ తన కొమారిత ను బిల్హణకవిని త్వరగా రప్పించెను. సరస్వతీపూజ మొదట చేసి యు రామాయణ ప్రారంభమును చేసెను. ఆ బిల్హణకవి అనుగ్రహము కలవాఁడై సత్కరింపఁబడినవాఁడై.

తత శ్చ రాజా స ర్వేషాం
బుధానాం వసు వాహనం
వస్త్రాదీ నుచితం దత్త్వా
స్వగృహాన్ ప్రాహిణోత్ తదా.

౩౬. దం.— పిమ్మట రాజు అందఱు పండితులకు ధనము వాహనము వస్త్రములు మొదలయినవి తగినట్లు ఇచ్చి వారివారి యిండ్లకు పంపెను అప్పుడు.

త త్రానయో ర్నరపతి ర్వర భోజ్య జాలం
తామ్బూల వస్త్ర శయ నాసన సంహతిం చ
దత్త్వో త్తమాం 'ప్రతిదినం నియమేన శాస్త్రా
భ్యాసం విధ త్త మి'తి తుష్టమనా దిదేశ.

౩౭. దం.—అచట వీరికి రాజు ఉత్తమ మయిన భోజ్యముల సమూహమును తాంబూలము వస్త్రములు శయనములు ఆసనములు—వీనిసమూహమును ఇచ్చి యుత్తమ మయినదానిని, 'ప్రతిదినము నియమముగలవారై శాస్త్రాభ్యాసమును చేయుఁడు' అని సంతుష్టచిత్తుఁడై ఆజ్ఞాపించెను.

తదాది బిల్హణకవిః
సర్వశాస్త్రాణి సర్వదా

బోధయామాస విధివ
ద్రాజపుత్త్రీం మనోహరమ్.

౩౮. దం.—అది మొదలుగా బిల్హణకవి సకల శాస్త్రములను సర్వదా తెలిపెను చక్కఁగా రాజపుత్త్రికి మనోహరముగా.

నానాలంకారశాస్త్రే నవరసభరితే
భావసంరమ్భయుక్తే
కావ్యే నానార్థశాస్త్రే సుజనబహుమతే
నాటకే చ ప్రశస్తే
స్వచ్ఛే చ్ఛన్దోబ్ధిపూరే బహుసుఖవిషయే
కామదే కామశాస్త్రే
ప్రౌ ఢాసీ ద్బిల్హణా ద ప్యధికమతియుతా
రాజపుత్త్రీ పవిత్రా?

౩౯. నవ రస భరితే నానా అలంకారశాస్త్రే = తొమ్మిది రసములతో నిండినదైన పలుతెగల యలంకార శాస్త్రములోను, భావ సంరమ్భ యుక్తే కావ్యే=భావముల తొట్రుపాటుతో కూడు కొన్నదైన కావ్యములోను, సుజన బహుమతే నానా అర్థశాస్త్రే= మంచివారికి సమ్మతమయిన సకలమయిన యర్థశాస్త్రములోను, ప్రశస్తే నాటకే చ = కొనియాడఁబడినదైన నాటకములోను, స్వచ్ఛే ఛన్దః అబ్ధిపూరే = స్వచ్ఛమయిన ఛందస్సనెడు సముద్ర ప్రవాహములోను, బహు సుఖ విషయే కామ దే కామశాస్త్రే = నానా సుఖములు విషయముగాఁ గలదై కోరికలు ఇచ్చునదైన కామశాస్త్రములోను, బిల్హణాత్ అపి అధిక మతి యుతా పవిత్రా రాజపుత్త్రీ ప్రౌఢా ఆసీత్ = బిల్హణునికంటెను ఎక్కువ బుద్ధితో కూడుకొన్నదైన పవిత్రురాలయిన రాజకన్య నేర్పరురా లాయెను.

అథైకదా కామసహాయభూత
స్తారాభికః శారదపూర్ణిమాయాం
వికాసయన్ సర్వదిశాం ముఖాని
సమారురోహేన్ద్రదిశం శశాఙ్కః.

౪౦. అథ ఏకదా శారద పూర్ణిమాయాం = పిమ్మట ఒకానొక ప్పుడు శరత్కాలపు పున్నమనాఁడు, కామ సహాయ భూతః = మన్మథునికి చెలికాఁడు అగువాఁడును, తారా అభికః = చుక్కల (లేక గురు భార్యయగు తారయొక్క) కాముకుఁడును, (అగు) శశాఙ్కః = చంద్రుఁడు, సర్వ దిశాం ముఖాని వికాసయన్ = సకల దిక్కులయొక్క ముఖములను వికసిల్లఁజేయుచు, ఇన్ద్ర దిశం సమారురోహ = ఇంద్రుని దిక్కును ఎక్కెను.

తా. ఒకానొక శారద పూర్ణిమయందు చంద్రుఁడు తూర్పున ఉదయించెను, నక్షత్రములు వెలుఁగుచుండినవి, దిఙ్ముఖములకు ప్రకాశము కలిగెను, విరహులకు మదనుఁడు ఏఁపఁదొడంగెను.

మార నారాచ నిశ్శాణ శాణోపల మివోదితం
యామినీ కామినీ కర్ణ కుణ్డలం చన్ద్రమణ్డలమ్.

౪౧. మా...లమ్ ఇవ = మదనుని బాణములకు నూఱుటకైన సానరాయియో యనునట్లు, యా...లం = రాత్రియను కాముకురాలి చెవియందలి కుండలమయిన చంద్రమండలము, ఉదితమ్ = ఉదయించినది.

తా. చంద్రబింబము మదనోద్దీపకముగాను అందముగాను ఉండెను. దానిచే రాత్రి రమణీయముగా నుండెను.

ఇదం కుముదభేదనం మదనమాన్ద్యవిచ్ఛేదనం
వియోగిజనవారణం విరహికామినీమారణం
సముల్లసతి సున్దరా దుదయకన్దరా ద్దైన్దవం
పురన్దరదిగిన్దిరాశ్రవణకుణ్డలం మణ్డలమ్.

౪౨. ఇదమ్ ఐన్దవం మణ్డలం = ఈ చంద్ర మండలము, కుము ద భేదనం = తెల్లగలువలను వికసిలంజేయునదియు, మదన మార్గ విచ్ఛేదనం = మన్మథునియొక్క అలసతను పోఁగొట్టునదియు (అంతవఱకు పగలు నిర్వ్యాపారుఁడై యున్నమదనుఁడు చంద్రోదయ ముచే ఉద్దీపితుఁడై వడిగా పనిచేయ నారంభించెను, అనఁగా చంద్రోదయముచే అందఱకు కామము రేఁగె నని భా.), వియత్ తిమిర వారణమ్ = వ్యాపించుచున్న చీఁకటిని పోఁగొట్టునదియు, విరహి కామినీ మారణం = ప్రియులనెడఁబాసిన కాముకురాండ్రను చంపు నదియు (చంద్రోదయముచే ఉద్రేకించిన కామమునకు ఓపలేక విరహిణులు మృతిఁబొందుచుండిరి అని భా.), (అట్టియీచంద్రమండలము) పురన్దరదిక్ ఇన్దిరా శ్రవణ కుణ్డలం=ఇంద్ర దిశా లక్ష్మియొక్క చెవియందలి కుండలముగా (మిగుల అందముగా తూర్పున, అనుట), సున్దరాత్ ఉదయ కన్దరాత్=అందమయిన ఉదయపర్వతముయొక్క గుహనుండి, సముల్లసతి=ఉదయించుచున్నది.

స్వైరం కైరవకోరకాన్ విదళయన్,
యూనాం మనః ఖేలయన్,
అమ్భోజాని నిమీలయన్, మృగదృశాం
మానం సమున్మూలయన్,
జ్యోత్స్నాం కన్దళయన్, దిశో ధవళయ
న్నమ్భోధి ముద్వేలయన్,
కోకా నాకులయన్, తమః కబళయ,
న్నిన్దుః సముజ్జృమ్భతే.

౪౩. ఇన్దుః = చంద్రుఁడు, స్వైరం = యథేచ్ఛముగా, కైరవ కోరకాన్ విదళయన్ = తెల్లగలువ మొగ్గలను విరియఁజేయుచు, యూనామ్ మనః ఖేలయన్ = యౌవనవంతుల మనస్సును ఆడించుచు (సంతోషపెట్టుచు), అమ్భోజాని నిమీలయన్=కమలములను

ముకుళింపఁజేయుచు, మృగదృశాం మానం సమున్మూలయన్ = (లేడికన్నులవంటి కన్నులుగల) స్త్రీలయొక్క అలుకను (స్త్రీలకు ప్రియులపైఁ గలుగుకోపవిశేషమును) పెకలించివైచుచు (చంద్రోదయమువలన కామము రేఁగఁగా స్త్రీలు సంగమము కోరి అలుకలు మాని ప్రియులను ఉపసర్పించిరి, అనుట.), జ్యోత్స్నాం కన్దళయన్=వెన్నెలను మొలకలెత్తించుచు, దిశః ధవళయన్=దిక్కులను తెలుపుసేయుచు, అమ్భోధిమ్ ఉద్వేలయన్ = సముద్రమును కట్టదాఁటించుచు (పొంగించుచు), కోకాన్ ఆకులయన్ = చక్రవాకములను వ్యథపెట్టుచు, తమః కబళయన్ = చీఁకటిని మ్రింగుచు, సముజ్జృమ్భతే=లేచుచున్నాఁడు.

శయ్యాగేహే శయన తలగో
బిల్హణః సోఽథ పూర్ణం
చన్ద్రం దృష్ట్వా నయనసుభగం
జాలమార్గేన భాన్తం
పృథ్వీచక్రే విరహివితతేః
కామసంతాపబీజం
చేతోజాతాకులితహృదయో
వర్ణయామాస తూర్ణమ్.

౪౪. అథ = అంతట, శయ్యా గేహే = పడక యింట, శయన తల గః=పానుపు మీఁద ఉన్నవాఁడై, సః బిల్హణః=ఆ బిల్హణుఁడు, నయన సుభగం భాన్తం పృథ్వీచక్రే విరహి వితతేః కామ సంతాప బీజం చన్ద్రం=నేత్రములకు ప్రియుఁడును ప్రకాశించుచున్నవాఁడును భూమండలమందు వియోగుల సమూహముల మదన జ్వరమునకు విత్తనమును (అయిన) చంద్రుని, జాల మార్గేణ దృష్ట్వా = గవాక్షము ద్వారా చూచి, చేతోజాత ఆకులిత హృదయః తూర్ణం

వర్ణయామాస = మన్మథునిచేత కలతపెట్టఁబడిన మనస్సుగలవాఁడై వెంటనే (ఇట్లు) వర్ణించెను.

నక్షత్రేశ, త్వదుదరగతం
చిహ్న మేకే వటద్రుం
భాషన్తే, ఽన్యే శశక, మపరే
కోమలాఙ్గం చమూరుం,
మన్యే కాన్తాధరదళవిధా
వగ్రహీత్ కుక్షిసంస్థం
తత్పీయూషం తవ విధి రహో
జాల మాసీత్ త దేతి.

౪౫. నక్షత్రేశ = చంద్రుఁడా, త్వత్ ఉదర గతం చిహ్నం = నీ కడుపును పొందిన (కడుపు మీఁది) గుర్తును, ఏకే=కొందఱు, వటద్రుం భాషన్తే = మఱ్ఱిచెట్టునుగా చెప్పుదురు (మఱ్ఱిచెట్టు అందురు), అన్యే శశ ఇతి = మఱికొందఱు కుందేలు అని (అందురు), పరే కోమల అఙ్గం చమూరుం = ఇతరులు మృదువయిన యవయవములుగల లేడినిగా (లేడి యని పలుకుదురు), విధిః = బ్రహ్మ, కాన్తా అధర దళ విధా = ప్రియురాలి చిగురువంటి క్రింది పెదవిని చేయుటకై, తవ కుక్షి సంస్థం తత్ పీయూషమ్ అగ్రహీత్ = నీయొక్క కడుపులో నున్న ప్రసిద్ధమయిన యమృతమును గ్రహించెను (అనియు), తదా జాలమ్ ఆసీత్ ఇతి=అప్పుడు (నీకడుపులో) దొండి ఆయెను అని (యు), మన్యే=నేను తలంచుచున్నాను.

అ. ఈకళంకము ప్రియురాలి యధరోష్ఠమును చేయుటకై బ్రహ్మ నీకడుపులోని యమృతమును గ్రహింపఁగా ఏర్పడిన దొండిగాని వారు వీరు చెప్పునట్లు వటవృక్షము మొదలగునది కాదు, అని తలంచెదను.

నేదం నభోమణ్డల మమ్బురాశి,
ర్నైమా శ్చ తారా నవఫేనఖణ్డాః,
నాయం శశీ కుణ్డలితః ఫణీన్ద్రో,
నాయం కళఙ్కః శయితో మురారిః.

౪౬. ఆకాశమును చుక్కలను చంద్రుని కళంకమును గూర్చి పలుకుచున్నాఁడు.

ఇదం నభోమణ్డలం న = ఇది (ఆకాశమును చూచి పలుకుచున్నాఁడు) ఆకాశచక్రము కాదు, (మఱియేమనిన) అమ్బు రాశిః = సముద్రము, ఇమాః చ తారా న=ఇవి యు నక్షత్రములుఁ గావు, (మఱి యే మనిన) నవ ఫేన ఖణ్డాః = క్రొత్తనురుగు తునియలు, అయం శశీ న = ఇతఁడు చంద్రుఁడు గాఁడు, (మఱి ఎవ రనిన) కుణ్డలితః ఫణీన్ద్రః=చుట్టచుట్టుకొనియున్న నాగేంద్రుఁడు (శేషుఁడు), అయం కళఙ్కః న=ఇది మచ్చ గాదు, (మఱి యేమనిన) శయితః మురారిః=(ఆనాగేంద్రునిపై) శయనించియున్న విష్ణువు.

ఆకాశము సముద్రమువలెను నక్షత్రములు నురుగులేశములవలెను, చంద్రుఁడు చుట్టచుట్టుకొనియున్న నాగేంద్రునివలెను కళంకము విష్ణువువలెను ఉండెను అని తా.

అఙ్కోఽ౽ కేపి శశఙ్కిరే, జలనిధేః
పఙ్కం పరే మేనిరే,
సారఙ్గం కతిచి చ్చ సంజగదిరే,
భూచ్ఛాయ మైచ్ఛన్ పరే,
ఇన్దౌ యద్దళితేన్ద్రనీలశకల
శ్యామం దరీదృశ్యతే
తత్ సాన్ద్రం నిశి పీత మన్ధతమసం
కుక్షిస్థ మాచక్ష్మహే.

౪౭. ఇన్దౌ = చంద్రునియందు, దళిత ఇన్ద్రనీల శకల శ్యామం = పగులఁగొట్టఁబడిన ఇంద్రనీలముయొక్క ముక్కవలె నల్లనిది, (యత్) దరీదృశ్యతే = (ఏది) మిక్కిలి అగపడుచున్నదో, తత్ = దానిని, కే అపి అఙ్కం శశఙ్కిరే = కొందఱు మచ్చనుగా భ్రమించిరి, పరే జలనిధేః పఙ్కం మేనిరే = ఇతరులు సముద్రము యొక్క బురదనుగా తలంచిరి, కతిచిత్ చ సారఙ్గం సంజగరిరే = కొందఱు మఱి లేడినిగా పలికిరి, పరే భూచ్ఛాయమ్ ఐచ్ఛన్ = ఇతరులు భూమి యొక్కనీడనుగా తలంచిరి, వయం తు = మే మయినమో, నిశీపీతం = (చంద్రునిచే) రాత్రి త్రాగఁబడినదై, కుక్షిస్థం సాన్ద్రమ్ అన్ధతమసమ్ ఆచక్ష్మహే = కడుపులోనున్న దట్టమయిన కటికి చీఁకటినిగా పలుకుచున్నాము.

ప్రాచీభాగే సరాగే, దరిణి విరహిణి,
క్రాన్తముద్రే సముద్రే,
నిద్రాణే నీరజాళౌ, ధృతముది కుముదే,
కోకలోకే సశోకే,
ఆకాశే సావకాశే, తమసి చశమితే,
నిర్వికారే చకోరే,
కన్దర్పేఽనల్పదర్పే, వికిరతి కిరణాన్
శర్వరీసార్వభౌమః.

౪౮. ప్రాచీభాగే సరాగే (సతి) = తూర్పుప్రదేశము ఎఱుపుతోఁ గూడుకొన్నది అగుచుండఁగా (తూర్పు ఎఱ్ఱఁబాఱుచుండఁగా), విరహిణి దరిణి (సతి) = ప్రియు నెడఁబాసిన స్త్రీయును ప్రియనెడఁబాసిన పురుషుఁడును భయముగలవారగుచుండఁగా (ఈ రాత్రి ఎట్లు వేగింతుమా అని భయపడుచుండఁగా), సముద్రే క్రాన్తముద్రే (సతి) = సముద్రము కట్టను దాఁటినదగుచుండఁగా (పొంగుచుండఁగా), నీరజ ఆళౌ నిద్రాణే (సతి)=కమలముల పఙ్క్తి

నిద్రించుచున్నది అగుచుండఁగా (ముకుళించు కొనుచుండఁగా), కుముదే ధృతముది (సతి) = తెల్లగలువ ధరించిన సంతోషముకలది అగుచుండఁగా, కోక లోకే సశోకే (సతి) = జక్కవల సమూహము శోకముగలది (అగుచుండఁగా), ఆకాశే సావకాశే (సతి) = ఆకాశము చోటుగలది అగుచుండఁగా, చకోరే నిర్వికారే (సతి) = వెన్నెలపులుగు వికారములేనిది అగుచుండఁగా, కన్దర్పే అనల్ప దర్పే (సతి) = మదనుఁడు మిక్కిలి గర్వముగలవాఁడు అగుచుండఁగా (నిశా చంద్రాది సాధనములచేత ఎల్లరను గెలుచుచు మదనుఁడు గర్వించుచుండఁగా), శర్వరీ సార్వభౌమః = రాత్రియొక్క ప్రభువు (చంద్రుఁడు), కిరణాన్ వికిరతి = కిరణములను వెదచల్లుచున్నాఁడు.

తా.— చంద్రోదయముచేత తూర్పు ఎఱ్ఱఁబాఱెను, విరహులు భయపడిరి, సముద్రము పొంగెను, కమలములు మొగిడెను, కలువలు వికసిల్లెను, కోకములు వగచెను (కోకములకు రాత్రి వియోగము ప్రసిద్ధము), ఆకాశము వెల్లడియాయెను, చీఁకటి అడఁగెను, చకోరములు సంతసించెను, మదనుఁడు జయించుచుండెను.

చన్ద్రమణ్డలసురఙ్గయా జగ
న్మన్దిరే మదనదస్యు రుత్థితః,
మానవిత్త మపహర్తు ముద్ధృతా
మోహభస్మకలికేవ కౌముదీ.

౪౯. మదన దస్యుః = మన్మథుఁడను దొంగ, మాన విత్తమ్ అపహర్తుమ్ = స్త్రీలయలుకయను ధనమును దొంగిలించుటకు, చన్ద్రమణ్డల సురఙ్గయా = చంద్రబింబమను సొరంగము ద్వారా, జగన్మన్దిరే ఉత్థితః = లోకమను గృహములో లేచినాఁడు (దూరినాఁడు, ప్రవేశించినాఁడు), కౌముదీ = వెన్నెల, ఉద్ధృతా = (వానిచే)

(నలిపి) పైఁజల్లఁబడిన, మోహ భస్మకలికా ఇవ = మచ్చు పొడుము యొక్క కణికయో యనునట్లు (ఒప్పుచున్నది.)

అ. దొంగ కన్నముద్వారా ఇల్లుసొచ్చి సొక్కుపొడుము చల్లును, ఆ పొడుము ప్రభావముచే జనులు నిద్రతెలియక పడియుందురు, అంతట వాఁడు కావలసినధనమును కొనిపోవును కదా. అట్లే మదనుఁడు చంద్రునిద్వారా జగత్తులో చొచ్చి వెన్నెలను వెదచల్లి స్త్రీ పురుషులకు ఒండొకరిమీఁదఁ గలిగిన యలుకను హరించెను.

తా.— చంద్రునివలన కామోద్దీపన మాయెను, వెన్నెలవలన కోపములు మఱచి కామినులు వల్లభులం బైకొనిరి.

ఆకాశశాణే శరదాఽభిరామే
రాశీకృతం చన్దన మిన్దుబిమ్బం,
తదన్త రాలోడయితుం వికీర్ణః
కస్తూరికారేణు రయం కళఙ్కః.

౫౦. (ఇదమ్) ఇన్దుబిమ్బం = (ఈ) చంద్రమండలము, శరదా = శరత్తుచేత (స్త్రీలింగస్వారస్యముచే శరద్వనితచేత అని వ్యంగ్యము), అభిరామే ఆకాశశాణే = రమణీయ మయిన ఆకాశమనుసానమీఁద, రాశీకృతం చన్దనమ్ = ముద్దగాఁజేయఁబడిన గంధము. అయం కళఙ్కః = ఈ మచ్చ, తదన్తః = ఆగంధపు ముద్దలోపల, ఆలోడయితుం = కలుపుటకు, వికీర్ణః కస్తూరికారేణుః = చల్లఁబడిన కస్తూరిచూర్ణము.

తా. ఆకాశము సానవలెను, చంద్రుఁడు గంధపుముద్దవలెను, కళంకము కస్తూరివలెను, ఉన్నవి.

ఆకాశవాపీఘనపుణ్డరీకం
శాణోపలం మన్మథసాయకానాం
పశ్యోదితం శారద ముత్పలాక్షి,
సంధ్యేన్ద్రిరాకన్దుక మిన్దుబిమ్బమ్.

౫౧. ఉత్పల అక్షి=కలువ కంటీ, ఆకాశవాపీ ఘన పుణ్డరీకం = ఆకాశమనుడిగ్గియయొక్క గొప్ప తెల్లదామరయు, మన్మథ సాయకానాం = మదనుని బాణములకు, శాణ ఉపలం = సాన రాయియు, సంధ్యా ఇన్దిరా కన్దుకం = సంధ్యా లక్ష్మియొక్క బంతియు, (అయిన) ఉదితం శారదమ్ ఇన్దు బిమ్బం పశ్య = పైకిలేచిన శరత్కాల చంద్ర మండలమును చూడుము.

ఆకా ... కమ్-- ఆకసము నల్లగా నీళ్లుగల బావివలెను, అందు చంద్రబింబము తెల్లదామరవలెను ఉన్నవని అ.

శా... నామ్.—చంద్రుఁడు మదినోద్దీపకుఁ డని అ.

సం... కమ్.— సంధ్యాలక్ష్మి పైకి ఎగురఁగొట్టిన బంతివలె చంద్రుఁడు ఉండెను అని అ.

రాజపుత్రి తనలో తాను విమర్శించుచున్నది. —

క్వ కాణః ? క్వ కళఙ్కీ చ ?
కథం వా తస్య వర్ణనమ్ ?
ఇతః పరం కి మాశ్చర్యం ?
కథం సంపద్యతా మిదమ్ !

౫౨. కాణః క్వ ? కళఙ్కీ క్వచ ? తస్య వర్ణనం కథంవా ?=అంధుఁ డెక్కడ? చంద్రుఁ డెక్కడ? అతనిని (చంద్రుని) వర్ణించుట ఎట్లు ? ఇతః పరం కిమ్ ఆశ్చర్యమ్ = ఇంతకన్న ఎక్కువ ఆశ్చర్యము ఏమున్నది ? ఇదం కథం సంపద్యతామ్ = ఇది యెట్లు సంభవించును!

అన్ధో నాయం ధ్రువం సర్వ
మేత జ్జనక కైతవమ్.
వ్రతభఙ్గో యది, స్యా ద్వా;
తం పశ్యామి మహాశయమ్.

౫3. ధ్రువమ్ అయమ్ అన్ధో న = నిశ్చయముగా ఇతఁడు గ్రుడ్డివాఁడు గాఁడు, ఏతత్ సర్వం జనక కైతవం = ఇది యంతయు

తండ్రియొక్క పన్నాగము, వ్రతభఙ్గః యది = వ్రతభంగ మేని, స్యాత్ వా = అయినను అగును గాక, తం మహాశయం పశ్యామి = ఆ మహానుభావుని చూచెదను.

ఇట్లు నిశ్చయించుకొని,—

ఉత్థాయ శయ్యాతల ఏవ తస్మి
న్నుద్గ్రీవి కాధఃకృత కాణ్డవస్త్రా
హస్తద్వయా ద్రత్నచితే గవాక్షే
రాజన్త మిన్దుం రమణీ దదర్శ.

౫౪. రమణీ = ఆకన్య, తస్మిన్ శయ్యా తల ఏవ=పడక మీఁద నే, ఉత్థాయ = లేచినిలిచి, ఉద్గ్రీవికా అధఃకృత కాణ్డవస్త్రా (సతీ) = మెడయెత్తుటచేత క్రిందుచేయఁబడిన తెంచీరగలది అయి (అనఁగా తెరమీఁదికి తల యెత్తి), హస్తద్వయాత్ = రెండుమూరలదూరమున, రత్న చితే గవాక్షే = రత్నములు తాపించిన కిటికీలో, రాజన్తమ్ ఇన్దుం దదర్శ = ప్రకాశించుచున్న చంద్రుని చూచెను.

యామినీపూర్ణతిలకా దృష్ట్వా కవి మతిస్మరం,
పఞ్చబాణశరాఘాతక్షతచేతా ముమోహ సా.

౫౫. సా యా...కా=ఆ యామినీపూర్ణతిలక, అతిస్మరం కవిం దృష్ట్వా=మదనుని అతిశయించుచున్న (యా, కవిని చూచి, పఞ్చబాణ శర ఆఘాత క్షత చేతాః = మదనుని బాణముల దెబ్బచే గాయ పడిన హృదయముగలదై, ముమోహ = మూర్ఛితురాలాయెను.

మదనునికన్న సుందరుఁడని కవిని ఆమె మెచ్చిన దను నసూయచే మదనుఁడు ఆమెను బాణములు ప్రయోగించి మూర్ఛితురాలిని చేసె నని వ్యంగ్యము.

తతః కిమేతదిత్యుక్త్వా ద్రాక్షీత్
కాణ్డానస్త్రోపరిస్థితం

వక్త్రం పూర్వాచలాభ్యుద్య
త్ప్రాలేయకిరణప్రభమ్.

గీc. కాన్త వస్త్ర ఉపరి స్థితం = తెరచీర మీఁద ఉన్నదై, పూర్వా అచల అభ్యుద్యత్ ప్రాలేయకిరణ ప్రభం = తూరుపు కొండనుండి ఉదయించుచున్న చంద్రుని కాంతి వంటి కాంతిగలదైన, తస్యాః వక్త్రమ్ = ఆమెయొక్క ముఖమును, కవీశ్వరః అద్రాక్షీత్ = కవిశ్రేష్ఠుఁడయిన బిల్హణుఁడు చూచెను.

కవి ఆమెను వర్ణించుచున్నాఁడు.—

కి మిన్దుః? కిం పద్మం?
కిము ముకురబిమ్బం? కిము ముఖం?
కి మబ్జే? కిం మీనౌ?
కిము మదనబాణౌ? కిము దృశౌ!
ఖగౌ వా? గుచ్ఛౌ వా?
కనకకలశౌ వా? కిము కుచౌ?
తటి ద్వా? తారా వా?
కనకలతికా వా? కి మబలా?

(ముఖమునుగుఱించి చెప్పుచున్నాఁడు.)

గీc. ఇన్దుః కిం, పద్మం కిం, ముకురబిమ్బం కిము, ముఖం కిము = చంద్రుఁడా, పద్మమా, అద్దపుబిళ్లా, ముఖమా?

(కన్నులగుఱించి చెప్పుచున్నాఁడు.)

అబ్జే కిం, మీనౌ కిం, మదనబాణౌ కిము, దృశౌ కిము = కమలములా, చేఁపలా, మన్మథబాణములా, కన్నులా?

(కుచములనుగుఱించి చెప్పుచున్నాఁడు.)

ఖగౌ వా, గుచ్ఛౌ వా, కనకకలశౌ వా, కుచౌ కిము—చక్రవాకములా, పూలగుత్తులా, బంగారుగిండ్లా, కుచములా?

౬౧|౩
(దేహమును గుఱించి చెప్పుచున్నాఁడు.)

తటిత్ వా, తారా వా, కనకలతికా వా, అబలా కిమ్=మెఱపు తీఁగయా, నక్షత్రమా, బంగారపుఁ దీఁగయా, కోమలియా?

ముఖము చంద్రాదులవలెను, నేత్రములు పద్మాదులవలెను, కుచములు చక్రవాకాదులవలెను, దేహము తటిదాదులవలెను, ఉన్నవి యని తా. లోకోత్తరసుందరి యని భా.

నేదం ముఖం మృగవిముక్త శశాఙ్కబిమ్బం,
నేమౌ స్తనా వమృతపూరిత హేమకుమ్భౌ,
నైవాలకావళి రియం మదనాస్త్రశాలా,
నైవేద మక్షియుగళం నిగళం హి యూనామ్.

టీ. ఇదం ముఖం న = ఇది ముఖము గాదు, (కిం తు=మఱి యేమనిన), మృగ విముక్త శశాఙ్క బిమ్బం=లేడిచే వదలఁబడిన చంద్ర మండలము, ఇమౌ స్తనౌ న = ఇవి కుచములు గావు, అమృత పూరిత హేమ కుమ్భౌ=అమృతముతో నిండింపఁబడిన బంగారపుఁ గలశములు, ఇయమ్ అలకా ఆవళిః న ఏవ=ఇది ముంగురుల వరుస కానే కాదు, మదన అస్త్రశాలా=మన్మథుని యాయుధ గృహము, ఇదమ్ అక్షి యుగళం న ఏవ=ఇది కను దోయి కానే కాదు, హి = నిశ్చయముగా, యూనాం నిగళమ్ = కోడెకాండ్రకు సంకెల.

ధ్వాన్తానాం పటలం సుధాంశుశకలం
కోదణ్డ మిన్దీవరే
పత్త్రిం కోకనదస్య కమ్బు లతికే
కుమ్భౌ నభః సైకతే
రమ్భే కాహళికే సరోజయుగళం
సంభూయ సర్వం క్వచిత్

పఞ్చేషుం భవదగ్ధ మఙ్కురయతే
భావజ్ఞమై ర్విభ్రమైః.

టీ. ధ్వాన్తానాం పటలం = చీఁకటుల గుంపు (కచభారము), సుధాంశు శకలమ్ = చంద్రఖండము (లలాటము), చాపౌ = రెండు విండ్లు (కనుబొమలు), తథా = ఆప్రకారమే, ఇన్దీవరే = రెండు నల్లగలువలు (కన్నులు), కోకనదస్య పత్త్రం = ఎఱ్ఱదామరపువ్వు యొక్క రేకు (అధరోష్ఠము), కమ్బు = శంఖము (కంఠము), లతికే = రెండుతీఁగలు (బాహువులు), కుమ్భౌ = కలశములు (కుచములు), నభః = ఆకాశము (నడుము), సైకతే = ఇసుకతిన్నెలు (పిఱుఁదులు), రమ్భే = అరఁటిచెట్లు (తొడలు), కాహళికే = సన్నాయులు (పిక్కలు), సరోజయుగళం = కమలములజత (పాదములు), సర్వం క్వచిత్ సంభూయ = ఈ చెప్పినదెల్ల ఒకచోట కూడినదై, భవ దగ్ధం పఞ్చేషుమ్ = శివునిచే కాల్పఁబడిన మన్మథుని, భావజ్ఞమైః విభ్రమైః = మనోహరములగు విలాసములచేత, అఙ్కురయతే = మొలపించుచున్నది. మదనావేశము కలిగించుచున్నదని భా.

మనో మే నాయాతం కఠినకుచయో ర న్తరగతం,
తదుద్ఘర్షా ద్ధ్వస్తం కి? ముత విరహాగ్నౌ నిపతితం?
తరుణ్యా లావణ్యామృతసరసి మగ్నం కి? మథవా
చర న్మార శ్శరైః కిముత దహర ద్వ్యావనవనే.

టీ. మే మనః = నా మనస్సు, కఠిన కుచయోః అన్తర గతం = (ప్రియురాలి) గట్టి స్తనముల నడిమికి పోయినది, న ఆయాతమ్ = (మరల నాయొద్దికి) రాకపోయినది, తత్ ఉద్ఘర్షాత్ = ఆకుచముల యొరపిడిచేత, ధ్వస్తం కిమ్ = నలిగిపోయినదా ఏమి? ఉత = అట్లుగాక, విరహా అగ్నౌ = వియోగమను నిప్పునందు, నిపతితం = పడినదాయేమి? తరుణ్యాః లావణ్య అమృతసరసి మగ్నం కిమ్ = ఆగుబ్బెతయొక్క దేహకాంతియనెడు అమృతసరస్సులో మునిఁగినదా ఏమి? అ

థవా=అట్లునుంగాడేని, యౌవన వనే చరన్ మారః చోరః=యౌవనమను నడవిలో తిరుగుచున్న మదనుఁడను దొంగ, తత్ అహారత్ కిము=ఆ నామనస్సును దొంగిలించెనా యేమి ?

యామినీపూర్ణతిలకపై అత్యంత మనస్సంగము కలిగిన దని భా.

ఆస్తాం మణ్డల మైన్దవం వరతనో
ర్వక్త్రశ్రియ శ్చేత్ కథా,
కోణే క్వాపి చ దాసతాం కువలయా
న్యక్ష్ణోః ప్రసఙ్గో యది,
దూరే తిష్ఠతు వల్లకీకలరవః
ప్రస్తావనా చే ద్గిరాం,
వార్తా చే దవలగ్న దేశ యశసాం
వ్యోమప్రభాయై నమః.

౬౧. వరతనోః = ఆసుందరాంగియొక్క, వక్త్రశ్రియః కథా చేత్ = ముఖలక్ష్మియొక్క ప్రస్తావము అగునేని, ఐన్దవం మణ్డలమ్ ఆస్తాం = చంద్ర బింబము అటుండుఁగాక (ఆముఖలక్ష్మి ముందఱ చంద్రబింబము కొఱగా దనుట), అక్ష్ణోః ప్రసఙ్గో యది= కన్నులయొక్క ప్రస్తావము అగునేని, కువలయాని క్వాపి చిత్ కోణే ఆసతాం = కలువలు ఎచటనయినను మూలలో ఉండును గాక, గిరాం ప్రస్తావనా చేత్=పలుకుల ప్రస్తావము అగునేని, వల్లకీ కలరవః దూరే తిష్ఠతు=వీణయొక్క మధుర నాదము దూరమున నుండును గాక, అవలగ్న దేశ యశసాం వార్తా చేత్ = మధ్యప్రదేశము (నడుము) యొక్క కీర్తుల ప్రస్తావము అయినచో, వ్యోమ ప్రభాయై నమః=ఆకాశముయొక్క కాంతికి నమస్కారము.

యామినీపూర్ణతిలకయొక్క ముఖము చంద్రుని, కన్నులు కలువలను, వాక్కు వీణానాదమును, నడుము ఆకాశమును, అతిశయించు చున్న వని తా.

ఏవం వర్ణయతి కవౌ,
తద్వాక్యామృతవిబోధితా జాతా,
పశ్చాత్ తన్ముఖచన్ద్రం
దృష్ట్వా లజ్జాభరాన్వితా జాతా.

౬౨. (యామినీపూర్ణతిలక), కవౌ ఏవం వర్ణయతి=బిల్హణుఁడు ఇట్లు వర్ణించుచుండఁగా, తత్ వాక్య అమృత విబోధితా = అతని వచనములనెడు అమృతముచే (మూర్ఛనుండి) లేపఁబడినది, జాతా =ఆయెను. పశ్చాత్=పిమ్మట, తత్ ముఖచన్ద్రమ్=అతని ముఖచంద్రుని, దృష్ట్వా=చూచి, లజ్జాభర అన్వితా జాతా=లజ్జాతిశయముతో కూడుకొన్నది ఆయెను.

(ఇందు ఒక జాతా యనుపదమునకు పిల్ల యని యర్థము చెప్పుదుమేని ఆరంభములో యామినీపూర్ణతిలక యని అధ్యాహరించుకోనక్కఱలేదు.)

తా.—అతని సౌందర్యమును చూడఁగా స్మృతి తప్పెను. అతని వర్ణనలు చెవిని పడి మరల స్మృతి గలిగెను. అతని ముఖమును చూడఁగా లజ్జ కలిగెను.—అని తా.

రాజపుత్త్రి తలంచుచున్నది.—

యద్యహం సులభస్వాన్తా
స్వయం గచ్ఛామి తం తదా
స్వీకుర్యాద్వా న వా? తస్య
మనో న జ్ఞాయతే మయా.

౬౩. అహం సులభస్వాన్తా (సతీ) స్వయం తం గచ్ఛామి యది =నేను చులుకని మనస్సుగలదాన (నై) స్వయముగా ఆతని యొద్దకి పోదు నేని, తదా=అప్పుడు, స్వీకుర్యాత్ వా న వా=(నన్ను) గ్రహించునో గ్రహింపఁడో, తస్య మనః మయా న జ్ఞాయతే=అతని మనస్సు నాకు తెలియక యున్నది.

ఇత్థం చేతసి సంప్రధార్య, వికలా
సా రాజపుత్త్రీ కవిం
త్యక్త్వా, కాణ్డపటం విహాయ, పతితా
శయ్యాతలే నిస్సహా.
కన్దర్పే శరసన్తతీ ర్విసృజతి
ప్రాజల్ప దార్తా భృశం
'రక్ష త్వం చతురానన నే' తి త దతః
శ్రుత్వా కవీశోఽభ్యధాత్.

౬౮. ఇత్థం చేతసి సంప్రధార్య=ఇట్లు మనస్సులో తలపోసి, వికలా సా రాజపుత్త్రీ=వ్యాకుల (యై) ఆ రాజకన్య, కవిం త్యక్త్వా=కవిని వదలి (కవినుండి చూపు మరల్చి), కాణ్డపటం విహాయ=తెరచీరను వదలి, నిస్సహా (సతీ) శయ్యా తలే పతితా (సతీ)=తాళలేనిది (ఐ) పాన్పు మీఁదఁ బడినది (ఐ), కన్దర్పే శరసన్తతీః విసృజతి (సతి) = మన్మథుఁడు బాణపరంపరలను వైచుచు (ఉండఁగా), భృశం ఆర్తా (సతీ)=మిక్కిలి పీడితురాలు (ఐ), చతురానన (చతుః+ ఆనన, చతుర+ ఆనన) ఓ నలుమొగముల వేలుపా (అందగాఁడా బిల్హణకవీ అని గూఢార్థము), త్వం రక్ష ఇతి =నీవు (నన్ను) కాపాడుము అని, ప్రాజల్పత్=పలికెను. అతః తత్ శ్రుత్వా కవీశః అభ్యధాత్=అంతట దానిని విని కవీశుఁడు పలికెను.

'ఇన్దీవరాక్షి, తవ తీక్ష్ణకటాక్షబాణ
ఘాతవ్రణే ద్వితయ మౌషధ మేత దేవ:
ఏకం త్వదీయమధురాధరపాన మన్యత్
త్వత్తుఙ్గపీనకుచ కుఙ్కుమపఙ్కలేపః.'

౬౯. ఇన్దీవరాక్షి = ఓకలువకంటీ, తవ తీక్ష్ణ కటాక్ష బాణ ఆఘాత వ్రణే=నీయొక్క వాఁడి కడకంటిచూపులు అను బాణముల

తాఁకుయొక్క గాయములకు, ద్వితయమ్ ఔషధమ్=రెండు విధముల యౌషధము, ఏతత్ ఏవ=ఈచెప్పఁబోవునది యే, ఏకం= అందొకవిధము, త్వదీయ మధుర అధర పానం=నీదైన తీయని క్రింది పెదవిని త్రాగుట, అన్యత్ = రెండవవిధము, త్వత్ తుఙ్గ పీన కుచ కుఙ్కుమ పఙ్క లేపః=నీయొక్క యున్నతములయిన వలుదలయిన స్తనముల కుంకుమ కలపమును పూయుట.

అ. నీవలన నయిన యీ మదనవ్రణము మానుటకై లోపలికి పుచ్చుకొనుటకును పైన పూయుటకును రెండువిధముల యౌషధము నీయొద్దనే కలదు. మఱి యెచటను లేదు, అనఁగా నీవు కలిగించిన యీ మదనాగ్ని నీసంగమమువలననే తీఱవలయును.

త స్యాఙ్గీకరణం జ్ఞాత్వా రాజపుత్త్రీ ప్రమోదతః
ఉత్థాయ శీఘ్ర మాగత్య గాఢాలిఙ్గన మాతనోత్.

౬౬. రాజపుత్త్రీ తస్య అఙ్గీకరణం జ్ఞాత్వా= యామినీపూర్ణతిలక అతని యంగీకారమును ఎఱిఁగి, ప్రమోదతః శీఘ్రమ్ ఉత్థాయ ఆగత్య గాఢ ఆలిఙ్గనం ఆతనోత్=సంతోషముతో త్వరగా లేచి వచ్చి బిగి కౌఁగిలింతను చేసెను.

స్రస్తా నీవీ న ఖలు, సహసా
సా స్వయం ముక్తబన్ధా;
మోక్తుం నైవే చ్ఛతి కుచపటీ,
మాత్మనా సైవ భిన్నా;
ద్రష్టుం నైవో న్నమయతి ముఖం,
స్వైర ముల్లోకనం తత్;
వ్రీడాం తస్యా విఫలయతి కో
ప్యేష భావానుబన్ధః.

౬౭. నీవీ స్రస్తా న ఖలు=పోఁకముడి విప్పఁబడ లేదు గదా (ఆమె లజ్జాపరాధీనతచే పోఁకముడిని సడలింపదాయెను, సా సహసా స్వయం ముక్త బద్ధా (జాతా) = ఆ నీవి తటాలున తనంతటతానే వదలింపఁబడిన ముడిగలది ఆయెను) (అనఁగా నీవి తనంతట తానే వదలినది), కుచపటీం హర్తుం న ఇచ్ఛతి ఏవ= (ఆమె) ఱవికను తీయుటకు దలంప నే లేదు, సా ఏవ ఆత్మనా భిన్నా=ఆ ఱవిక యే తనంతటతాను వదలిపోయినది, ద్రష్టుం=బిల్హణుని చూచుటకు, ముఖం=తనముఖమును, న ఉన్నమయతి ఏవ=ఎత్త నే ఎత్తదు, తత్ స్వైరమ్. ఉల్లోకనం = ఆముఖము తనంతటతానే పైకి చూచునది, (ఈప్రకారము) కః అపి=ఏదో అనిర్వచనీయమయిన, భావ అనుబన్ధః = భావముయొక్క ఆవేశము, తస్యాః హ్రీడాం = ఆమెయొక్క సిగ్గును, విఫలయతి ఏవ = నిష్ఫలముగా చేయనే చేసెను.

తా. లజ్జచే నీవిని ఆమె వదలింపకపోయినను భావవిశేషావేశముచే అది తనంతనే వదలిపోయినది. ఆమె ఱవిక వదల్పకపోయినను అదియే వదలిపోయినది. అతనిముఖమును కాంచుటకు తనమొగమును ఎత్తకపోయినను దృష్టులు పైకి నిగిడి అతని[illegible]మును చూచుచునే యుండినవి. ఇట్లు లజ్జచే ఆటంకపడిన ప్రయోజనమును భావవిశేషము నెఱవేర్చినది. లజ్జకన్న భావము హెచ్చాయెను.

అనయాప్తా కిం మనోజ్ఞశీకృణనిహా
దానద్రవార్ద్ధా సు గా?
నత్రాలాంఛనచేన కిం కృతవా
కర్ణాన్తే గాహనా?
నా నేత్రే చా దనజ్ఞకిం చా
చిత్తే ప్రవిష్టా సకిం?

తన్వీ కిం బహునా రసేన మిళితా
యాతా మ యైకాత్మతామ్?

ఉ౯. తన్వీ సా=సన్నపాటిదేహముగలదైన యాచెలువ, అపాఙ్గ వీక్షణ మిషాత్ ఆనన్దవార్ధౌ అమగ్నా కిం ను=కడకంటిచూపుల మిషచేత ఆనందసముద్రములో మునిఁగిన దా యేమి? నర్మ ఆలాప పదేన కర్ణ అన్తరే గాహనం కృతవతీ కిం=పరిహాస వచనములను నిమిత్తముచే చెవిలో ప్రవేశము చేసినదా యేమి? గాఢ ఆశ్లేష మిషాత్=బిగి కవుంగిలియను వ్యాజముచే, అనఙ్గ వివశా = మదన పరతంత్రయై, చిత్తం ప్రవిష్టా కిం ను= (నా) హృదయములోఁ జొచ్చిన దా యేమి? బహునా రసేన మిళితా (సతి) =విస్తారమయిన అనురాగముచే (ద్రవముచే) కూడినదై, మయా ఏకాత్మతాం యాతా కిమ్ = నాతో ఐక్యము పొందినదా యేమి?.

ముఖరవలయజాలో మోదితాశేషగాత్రః
పులకముకుళసాన్ద్రో బోధితానఙ్గతన్ద్రః
పర మురసినిమగ్నస్ఫారవక్షోజకుమ్భః
సుఖయతు సుముఖీనాం దోర్లతాగాఢబన్ధః.

ఉ౯. ముఖర వలయ జాలః = గల్లుగల్లుమనిశబ్దించుచున్న గాజుల సమూహముగలదియు, మోదిత అశేష గాత్రః = ఆనందపెట్టఁబడిన సమస్తమయిన అవయవములు గలదియు, పులక ముకుళ సాన్ద్రః = గగుర్పాటు మొగ్గలచే దట్టమయినదియు, బోధిత అనఙ్గ తన్ద్రః = మేలుకొలుపఁబడిన మదన మాంద్యముగలదియు, ఉరసి నిమగ్న స్ఫార వక్షోజ కుమ్భః = (ప్రియుని) హృదయమందు మునిఁగిన (ప్రియురాలి) వలుద కుచకలశములు కలదియు, (అగు) సుముఖీనాం దోః లతా గాఢబన్ధః = సుందరాననలయొక్క తీఁగలవంటి బాహువుల బిగికౌఁగిలి, పరం సుఖయతు = (ప్రియుఁడు) మిగుల సఖింపఁజేయునుగాక.

మేఘో వర్షతి మీనకేతువిశిఖా,
నభ్రం సముత్కంప్యతే,
ధత్తే మౌక్తికజాల మిన్దు, రయతే
తారళ్య మిన్దీవరే
శఙ్ఖ శ్చానుకరోతి హన్త శనకైః
పారావతప్రక్రియాం,
తారం భ్రామ్యతి చక్రవాకయుగళీ
చిత్రం విధానం విధేః.

పురుషాయితమును వర్ణించుచున్నాఁడు.

20. మేఘః మీనకేతు విశిఖాన్ వర్షతి = మబ్బు మన్మథ బాణములను వర్షించుచున్నది (కొప్పునుండి పుష్పములు రాలుచున్నవి), అభ్రం సముత్కంప్యతే = ఆకాశము వణఁకుచున్నది (నడుము అల్లలనాడుచున్నది). ఇన్దుః మౌక్తిక జాలం ధత్తే=చంద్రుఁడు ముత్యాల వలను (లేక, సమూహమును) ధరించుచున్నాఁడు (మొగముపై నంతట చెమ్మట గ్రమ్ముచున్నది), తారళ్యమ్ ఇన్దీవరే అయతే= చాంచల్యము (రెండు) నల్లగలువలను పొందుచున్నది (కన్నులు బిత్తరిచూపులు చూచుచున్నవి), హన్త = ఆహా, శఙ్ఖః చ = శంఖమయినను, పారావత ప్రక్రియాం శనకైః అనుకరోతి = పావురముయొక్క విధమును మెల్లగా అనుకరించుచున్నది (కంఠము పావురా గుబాళింపువలె మెల్లగా మణితధ్వనులు చేయుచున్నది), చక్రవాక యుగళీ = జక్కవల జత (చనుదోయి), తారం భ్రామ్యతి = ఎత్తుగా తిరుగుచున్నది; విధేః విధానం చిత్రమ్ = బ్రహ్మయొక్క చేఁత ఆశ్చర్యముగా నున్నది.

ఇందు మేఘాదిపదములు సాదృశ్యముచే కొప్పుమొదలగువానిని తెలుపుచున్నవి.

దాయాదాః శరదిన్దుకాన్తిధవళా
శ్చన్ద్రం పరిష్కుర్వతే,
శఙ్ఖస్యాశయసంభవాఙ్కయుగళీ
ప్రాప్నోతి సంకోచితాం,
నృత్యన్తి ప్రతిపక్షవస్తునివహా
మాయా గృహే తేజసాం,
కేశాన్తే గిరిధన్వనః శమయతే
ఖేదం గభీరావటః.

౭౧. శరత్ ఇన్దు కాన్తి ధవళాః = శరత్కాలపుఁ జంద్రుని కాంతివలె తెల్లనివైన (కడమఋతువులకంటె శరదృతువులోఁ జంద్రుఁడు మిగుల తెల్లగా వెలుఁగును గదా), శఙ్ఖస్య దాయదాః = సంకువుయొక్క పిల్లలు (ముత్తెములు, శంఖమునుండియు ముత్తెములు పుట్టునని ప్రసిద్ధి), చన్ద్రం పరిష్కుర్వతే = చంద్రుని అలంకరించుచున్నవి (వానిని దాల్చి చంద్రుఁడు శోభిల్లుచున్నాఁడు), ఆశయసంభవ అఙ్క యుగళీ సంకోచితాం ప్రాప్నోతి = మన్మథుని చిహ్నముల జత (మత్స్యములజత) ముణుఁగుఁబాటును పొందుచున్నది, మాయాః గృహే = లక్ష్మియొక్క యింట (పద్మమునందు, లక్ష్మికి పద్మము ఇల్లు, 'లక్ష్మీః పద్మాలయా' యని యమరము), తేజసాం ప్రతిపక్ష వస్తు నివహాః నృత్యన్తి = వెలుఁగులఁయొక్క శత్రువులయిన వస్తువుల సమూహములు చీఁకటులు) నృత్యమాడుచున్నవి, గిరిధన్వనః కేశాన్తే = కొండవిలుకాని తలవెంట్రుకలతుదను (ఆకాశాంతమున, శివునికి మేరుపర్వతము విల్లు, ఆకాశము తలకట్టు), గభీర అవటః = లోఁతు గోయి, ఖేదం శమయతే = ఆయాసమును హరించుచున్నది.

ముత్తెములు చంద్రుని అలంకరించుచున్నవి, చేఁపలజత ముణుఁచుకొనుచున్నది. కమలములమీఁద చీఁకటులు ఆడుచున్నవి, ఆకా

శములో గోయి శ్రమనుహరించుచున్నది; అనుటచే,—ముఖము చె
మర్చినది, కన్నులు మూంతపడినవి, కొప్పువీడి ముఖముపై చెదరుచుం
డినది, నడుములో నాభిలోనికి చెమట ప్రవహించినది, అని తా.

భాన్తి పయఃపరిణామా
స్త్రిదశాహారే, తదీయసూతిగృహాత్
ఉచ్చలతి కోఽపి నాద,
స్తద్గుణిని భ్రమతి గిరియుగం చిత్రమ్!

౨౨. త్రిదశ ఆహారే = దేవతల యన్నమునందు (చంద్రనియం దు, చంద్రకళలను దేవతలు భక్షింతురు అని శాస్త్రము. పయః ప రిణామాః = నీళ్లయొక్క వికృతులు (ముత్తెములు, వర్షబిందువులు గదా ముత్తెపుఁజిప్పలలో పడి ముత్తెములగును), భాన్తి = వెలుం గుచున్నవి. తదీయ సూతి గృహాత్ = ఆముత్తెముల పుట్టినింటినుం డి (శంఖమునుండి, శంఖముచుండి కూడ ముత్తెములు పుట్టునని శా స్త్రము), కోఽపి నాదః ఉచ్చలతి = ఏదో శబ్దము వెడలుచున్నది, తత్ గుణిని = శబ్దము గుణముగాఁగలదానియందు (ఆకాశమందు, శబ్దము ఆకాశముయొక్క గుణ మని తార్కికులు చెప్పుదురు), గిరి యుగం భ్రమతి = కొండల జత తిరుగుచున్నది, చిత్రమ్ = ఆశ్చ ర్యము

తా.—ముఖము చెమర్చినది, కంఠములో మణితధ్వనులు కలు గుచున్నవి, నడుముపై చనుదోయి కదలుచుండెను.

అచిరరుచా విలసన్త్యా
అమృతముచాభావి ఘనఘనబిన్దుముచా,
పయోముచా ప్రసవముచా,
విరుచా కిం చాపి తారహారముచా

౨౩. అచిరరుచా విలసన్త్యా అభావి = మెఱపు (దేహము) లా స్యమాడునది ఆమెను, అమృతముచా ఘన బిన్దుముచా (అభా

వి) = చంద్రబింబము (ముఖము) చెమటబొట్టులను రాల్చునది (ఆయెను), పయోముచా ప్రసవముచా (అభావి)= మేఘము (కొప్పు) పూవులు రాల్చునది (ఆయెను), కిం చ అపి = మఱియు, విరుచా తారహారముచా (అభావి) = ఆకాశము (నడుము, విరుక్ అనఁగా కాంతిలేనిది, ఆకాశమునకు కాంతివర్ణాదులు లేవుగాన నభాతీతి నభః అని వ్యుత్పాదించినట్లే విరుక్ శబ్దమును ఆకాశపరముగా చెప్పఁకోఁదగును) పులుగడిగిన ముత్యాలహారములను రాల్చునది (ఆయెను).

తా. పురుషాయితమందు ప్రియాదేహము నర్తింపు చుండినది, నెమ్మోము చెమర్చినది, కబరి వీడి పువ్వులు రాలి పేరులు పెరిగి ముత్యాలు నడుమునుండి రాలుచుండినవి.

స్వచ్ఛాఙ్గీ నవమార్జనా దసిల తే
వోల్లాసితా స్వాత్మనా
జ్యోత్స్నాపూరవిపాణ్డరామ్బరధరా
రాత్రి ర్యథా శారదీ
బిభ్రాణా కరపల్లవేన కబరీ
మార్ద్రా మియం దృశ్యతే
శ్రీః శృఙ్గారసుధాపయోధిసలిలా
దభ్యుత్థి తే వాపరా.

౨౪. ఇయమ్= ఈమె, అసి లతా ఇవ = లతవంటిదగు కత్తివలె, నవ మార్జనాత్ = క్రొత్త స్నానముచేత (అనఁగా అప్పుడే స్నానముచేసినందున, అని ఆమెకు అన్వయించునర్థము, క్రొత్త చికిలిచేత అని కత్తికి అన్వయించునర్థము), స్వచ్ఛ అఙ్గీ = శుద్ధమయిన దేహముగలదై (ప్రతిబింబించునట్టి, త్రుప్పు మొదలగు దోషములులేని అని కత్తికి విశేషణమయినప్పుడు అర్థము), స్వఆత్మనా = తనస్వరూపముచే (అనఁగా అంగరాగాదులు లేకుండ, అని ఆమెకు అన్వయ

ము, దుమ్ము మొదలయినవిలేక, యని కత్తికి అన్వయము), ఉల్లాసితా = ప్రకాశించునట్లు చేయఁబడినదై [అనఁగా కత్తిని క్రొత్తగా చికిలిచేసినయెడల ఆగంతుకమయిన త్రుప్పు మొదలయినవి లేక అది సహజస్వరూపముతో ప్రకాశించును. అట్లే ఆమె స్నానముచే ఆగంతుకములయిన యంగరాగాదులు పోఁగా సహజకాంతితో వెలుంగుచుండెను, అని తా.] శారదీ రాత్రిః యథా=శరత్కాలపు రాత్రి వలె, జ్యోత్స్నా పూర విపాణ్డుర అమ్బర ధరా = వెన్నెల ప్రవాహమువలె తెల్లనయిన వస్త్రమును దాల్చినదై (వెన్నెలప్రవాహమువలె తెల్లనయిన యాకాశమును దాల్చినది, అని శారదరాత్రి పరమయిన యర్థము), కర పల్లవేన = చిగురువంటి చేతితో, ఆర్ద్రాం కబరీం బిభ్రాణా = తడి కొప్పును పట్టుకొనియున్నదై, శృఙ్గార సుధా పయోధి సలిలాత్ = శృంగారమను అమృతము యొక్క సముద్రముయొక్క జలమునుండి, అభ్యుత్థితా అపరా శ్రీః ఇవ=లేచిన మఱియొక లక్ష్మి వలె, దృశ్యతే=అగపడుచున్నది.

చికిలిచేసినకత్తిని ఉపమానముగా చెప్పుటచేత స్నానమునకు ముందే కామమును రేపుచుండినయామె స్నానముచే స్వచ్ఛదేహయై మఱియు కామోద్రేకము గలిగించుచుండెనని భా. వెన్నెలవంటి తెల్లనివస్త్రమనుటచే — సన్నని తెల్లచీరయనియు, నలుపు ఎఱుపు పసపు వన్నెలచీరలు చెప్పక సన్నని తెల్లచీరను చెప్పుటచే తెల్లనిసన్నతడిచీరె ఒడలికంటుకొనిపోయి దేహమునందలి నాభిసుచాది పల్లము మెఱకలు మొదలయిన యంగసౌష్ఠవము స్పష్టముగా అగపడుటచేత ఆమె మఱియు మనోహారిణియై మఱియు కామోద్రేకము గలిగించె నని భా. కొప్పును చేతనుంచుకొనె ననుటచే దర్శనీయ మైన యంగన్యాసవిశేషము, తలకట్టు, వెంట్రుకలు దేహము పైఁబడిన సహింపనిసౌకమార్యమును తెలుపఁబడుచున్నవి. శృంగారసుధాసముద్రమనుటచే సాక్షాల్లక్ష్మికంటె అందముగా నున్నదనియు, శృంగారసారమే ఆమె యనియు భా.

దమ్పత్యో శ్శయనస్థయోః ప్రణయతో
జాతే మహావిగ్రహే
వైముఖ్యం సమభూత్ తదైవ మదనా
వస్థాక్షమే యోజితే;
భో దూతీ విరహా బలీభవతి, సా
శయ్యాపి న స్పన్దతే,
తత్రాచ్ఛాదన మేవ తావ దుభయోః
స్నేహం వ్యధాత్ పుణ్యతః.

౭౫. శయన స్థయోః=పానుపునందు ఉన్న, దమ్పత్యోః = భార్యా భర్తలకు, ప్రణయతః = అనురాగముచేత (పరస్పరానురాగపరీక్షార్థము), మహావిగ్రహే జాతే (సతి)=గొప్పయలుక కలుఁగగా, వైముఖ్యం = పెడమొగము గలిగియుండుట, సమభూత్ = సంభవించినది (అనఁగా పొలయలుకచే మౌనము దాల్చి పెడమరలి పరుండిరి), తదా ఏవ=అప్పుడే, మదన అవస్థా అక్షమే = జాగరకృశతాది మదనావస్థయు తాళలేమియు, యోజితే = కూర్పఁబడినవి (పెడమరలినమాత్రాన ఆవిరహము తాళరానిదై నిద్రపట్టకున్నను ఆలింగనము చేయకయుండలేకయు బిగువుపోవునట్లు బేలతనముగా అలుకమానకయు శ్రమపడుచుండిరి), భోః = అన్యోన్యాపాపము (ఆసమయములో), దూతీ విరహః=దూతికతోడి వియోగము (అనఁగా దూతిక లేమి), బలీభవతి = ప్రబలమాయెను (దూతియున్న ఆసమయయములో), వారివారి బెట్టు తగ్గనీయకయే అలుకలు మాన్పి సంధిచేసి కామతంత్రము నెరవేర్చును, అది లేనందున నసిధారావ్రతముగా నుండవలసివచ్చినది, అందువలన కలిగిన యాశ్రమ దుస్సహముగానుండెను, సా శయ్యా అపి = ఆ పాన్పు అయినను, న స్పన్దతే =కదలదాయెను (వీరు కదలక మెదలక యుండిరిగాన శయ్య చలింపలేదు), తత్ర తావత్ =అట్టి స్థితిలో, ఆచ్ఛాదనమ్ ఏవ = కప్పడమే

(దుప్పటియే), ఉభయోః = ఇరువురకు, పుణ్యతః = పుణ్యవశమున, స్నేహం వ్యధాత్ = స్నేహము చేసెను (కప్పుకొనుటకు దుప్పటిపైకి లాగికొనుట యనుమిషచేత ఒకరొకరిని తాఁకి స్పర్శసుఖములో అలుక మాని కలసిరి.

ఉగ్రగ్రాహ ముదన్వతో జల మతి
 క్రామ, త్యనాలమ్బనే
వ్యోమ్ని భ్రామ్యతి, దుర్గమక్షితిభృతాం
 మూర్ధాన మారోహతి,
వ్యాప్తం యాతి ఫణాకరై రహివరైః
 పాతాళ మేకాకినీ,
కీర్తి స్తే మదనాభిరామనృపతే,
 మధ్యేసభం యోషితామ్.

రాజపరమయిన యర్థము.

౨౬. మదనాభిరామ నృపతే = మదనాభిరామ రాజా, తే కీర్తిః = నీ యశస్సు, యోషితాం మధ్యేసభం = స్త్రీల సమూహమధ్యమందు, ఏకాకినీ = ఒంటరిదిగానే, ఉగ్రగ్రాహమ్ ఉదన్వతో జలమ్ అతిక్రామతి = భయంకరమయిన మొసళ్లుగలదైన, (భయంకరమైన పట్టుకొనుటగలదైన, అనఁగా ఎట్టివారినయినను తనలోనికి లాఁగికొని ముంచివైచుట యనునపాయము కలిగించునదైన, గ్రాహ = మొసలి, పట్టు.) సముద్రముయొక్క జలమును దాఁటుచున్నది, అనాలమ్బనే వ్యోమ్ని భ్రామ్యతి = నిలువరములేని ఆకాశములో తిరుగుచున్నది, దుర్గమ క్షితిభృతాం మూర్ధానం ఆరోహతి = ఎక్క (సమీపింప) శక్యముగాని కొండల (రాజుల) శిఖరమును (తలను) ఎక్కుచున్నది, ఫణాకరైః అహివరైః వ్యాప్తం పాతాళం యాతి = పడగవిప్పునవైన పాములచే వ్యాపింపఁబడిన పాతాళమునకు పోవుచున్నది.

తా. — ఓమదనాభిరామరాజా, నీకౌమారితయొక్క సౌందర్య చాతుర్య వైదుష్యాదులవలన గలిగిన నీకీర్తి ( ఇతరులకీర్తివలెంగాక) పోవుటకు శక్యముగాని సకలప్రదేశములకును పోయి మూఁడులోకములలోను వ్యాపించుచున్నది. సముద్రములోని ద్వీపాంతరముల రాజులు నీకీర్తిని కోరికోరి వినుచున్నారు. ఎట్టివారికిని ప్రవేశమీయని యుగ్రస్వభావులయిన పర్వతనివాసులును రాజులును నీకీర్తికి వశ్యులై దాసులై దానిని సౌమ్యతతో ఆసక్తితో వినుచున్నారు. పాతాళములోనినాగేంద్రులు కొంచెమున కంత పడగవిప్పి బుసకొట్టి కలచి చంపువారు నీకీర్తిని ఆశతో వినుచున్నారు. ఆకాశమందలి సిద్ధవిద్యాధరాదులు కూడ నీకీర్తిని శ్రవణామృతముగా చెప్పుకొనుచున్నారు. ఎల్లచోట్లను స్త్రీలు నీకీర్తిని ప్రశంసించుచున్నారు.

భా. ఉగ్ర — దుర్గమ — అనాలంబన - ఫణాకర శబ్దములు భయంకరత్వమును ,అసాధ్యత్వమును తెలుపుచున్నవి, 'తలయెత్తు' ననుట కీర్తియొక్క సంపూర్ణజయమును రాజులసంపూర్ణవశ్యతను తెలుపుచున్నది, 'ఏకాకినీ' యనుటచే మఱియెవరికీర్తియు ఇట్లు వ్యాపింప లేదనియు 'కీర్తి' యని స్త్రీలింగశబ్దస్వారస్యముచే పురుషునికైన ఇంతసాహసము చాతుర్యము ఉండవు, కీర్తి స్త్రీగావున దానికి ఇంత నేర్పు కలిగిన దనియు, 'స్త్రీసమూహము నడుమ' అనుటచే, యామినీపూర్ణతిలకయొక్క గుణములను స్త్రీలు గూడ ఆశ్చర్యముతో చెప్పుకొందురు — ఇఁక పురుషులమాట చెప్పవలయునా— వారు అంతకు ముందే తదాసక్తులు — స్త్రీలకుఁగూడ ప్రశంసనీయమయినయామెసౌందర్యాదికము అది యెట్టిదో అనియు భా. ఈవర్ణనచే నీకుమారితయొక్క సౌందర్యమునకు మూఁడులోకములును దాస్యము చేయఁదగును అని భా.

మదన పరమయిన యర్థము.

మదన అభిరామ నృపతే = మన్మథుఁడా మనోహరుఁడా రాజా (అని మదనునికే మూఁడుసంబోధనలు).

తా.—ఓమదనుఁడా, స్త్రీపురుషులు చేరినచో నీకు లోఁబడ నివారు లేరు. సముద్రములో ఘోరములైన మొసళ్లును, ఆకాశములోనిపక్షులును సిద్ధాదులును, కొండలమీఁది పశుప్రాయులును, ఘాతుకమృగములును, దురారాధ్యులైన రాజులును, పాతాళములోని క్రూరసర్పములును, అన్నిప్రాణులు ఏకరీతిగా నీదెబ్బకు (కామమునకు) లోఁబడి యున్నవి. ఎట్టిక్రూరప్రాణులును నీమహిమచే తమప్రియలకు లోనై యున్నవి. ఎట్టి క్రూరప్రాణుల నయినను ప్రియలు నీమహిమచే సకలాపాయములను ఓర్చి పైకొనుచున్నవి. ఇట్లు సకలలోకములను జయించినవాఁడవు నీ వొక్కఁడవే.

మొసళ్లు – సముద్రజలము – ఆకాశము – కొండలు – పాము – పాతాళము – ఇవి వరుసగా పిక్కలు – లావణ్యప్రవాహము – నడుము – కుచములు – నూఁగారు – నాభి—వీనికి ఉపమానములు గాన అతిశయోక్తిచే అర్థవిశేషము ఏమనఁగా.—

ఓమదనా సర్వలోకాధిపతీ, నీజయకీర్తి స్త్రీలనడుమ (కాముకులకు) భయంకరమయిన (అనఁగా కాముకులను లోఁబఱుచుకొనునట్టి) జంఘలు కలదైనలావణ్య ప్రవాహమును దాఁటుచున్నది. (తొడలు మొదలయిన యవయవముల కాంతిప్రవాహము సముద్రజలపూరమువలె నుండఁగా అందులో జంఘాకాండములు మొసళ్లవలెనుండి పురుషులదృష్టులు అను జనులను పట్టుకొనుచున్నవి. అనఁగా ఆలావణ్యపూరము జంఘాసౌందర్యమును పురుషులచిత్తమును హరించి కామావేశము కలిగించుచున్నవి.) పట్టుదొరకని నడుములో (నడుము శూన్యముగాన పట్టుకొనుటకు చేతికి దొరకదు) తిరుగుచున్నది (సన్ననినడుము యొక్క యందమునకును పురుషులు లోఁబడుచున్నారు. పుణ్యహీనులకు లభింపని కుచముల మీఁదికి ఎక్కుచున్నది (దుర్గము-కుచములు పుణ్యాత్ములకేగాని లభింపవు, వానిని చూచి కామునికి లోఁబడనివాఁడు లేఁడు), నీజ

యఃకీర్తి) నూఁగారు ప్రాఁకియుండు పొక్కిటిపొఁదికి పోవుచున్నది. (నూఁగారుయొక్కయు నాభియొక్కయు సౌందర్యమును చూచి పురుషులు మదనునికి దాసు లగుచున్నారు) అన్నియు నీజయము నే సాధించుచున్నవి.

కవి సామాన్యనిబంధనాప్రస్తుతప్రశంసారూపమున యామినీపూర్ణ తిలకను ఇట్లు వర్ణించుచున్నాఁడు.

భా.—ఓయామినీపూర్ణతిలకా, నీయొక్క ఊరుజంఘాదిలావణ్యము జంఘాసౌందర్యము నడుము సన్నఁదనము చనుదోయి నిక్కు నూఁగారుసొబగు నాభిలోఁతును చూఁడగా నీకై కామమోహితుఁడు గానివాఁడు ఉండఁడు.

సుభ్రు, త్వం కుపి తే త్యపా స్త మశనం,
త్యక్తా కథా యోషితాం,
దూరా దేవ వివర్జితాః సురభయః
స్రగ్గంధధూపాదయః,
కోపం రాగిణి, ముఞ్చ మ య్యవనతే
దృష్టే ప్రసీ దాధునా,
సత్యం త్వద్విరహా ద్భవన్తి దయితే,
సర్వా మ మాన్ధా దిశః.

అప్రకృతార్థము.

౨౨. సుభ్రు = అందమయిన కనుబొమలుగల, దృష్టే = ఓ (నా) నేత్రమా, త్వం కుపితా ఇతి = నీవు కలంగితివి గాన, అశనమ్ అపాస్తం = ఆహారము వదలఁబడినది (నొప్పిచేత భోజనముకూడ మానినాఁడను), యోషితాం కథా త్యక్తా = స్త్రీల ప్రస్తావము వదలఁబడినది (స్త్రీసాంగత్యము అపథ్యముగావున అది మానఁబడినది), సురభయః = పరిమళవంతములయిన, స్రజ్ గన్ధ ధూప ఆదయః = పూలదండలు చందనాదికము అగర్వాదిధూపము మొదలు

గాఁగలవి, దూరాత్ ఏవ వివర్జితాః = దూరమునుండి యే పరిహరింపఁబడినవి (నొప్పిచేత చిత్తము అస్వస్థముగా నుండుటచే స్రగాదులు కనులకలఁకకు అపథ్యములు అగుటచేతను వానిని దగ్గఱకే రానీయలేదు), హే రాగిణి = ఓ యెఱుపుగలదానా, కోపం ముఞ్చ = కలఁకను మానుము, మయి అవనతే = నేను (వెలుతురు చూడలేనందున) మొగమువంచుకొనియుండఁగా, అధునా = ఇప్పుడు, ప్రసీద = తేటపడుము, దయితే = ప్రియమయిన యోనా దృష్టీ, సత్యం = వాస్తవముగా, త్వత్ విరహాత్ = నీ వియోగముచే (నీవు లేనందున, చూపు లేనందున), మమ సర్వా దిశః అన్ధాః భవన్తి = నాకు అన్ని దిక్కులు గ్రుడ్డివి (అగపడనివి) అగుచున్నవి (ఏమియు అగపడుట లేదు).

## ప్రకృతార్థము.

సుభ్రు = అందమయిన కనుబొమలుగలదానా, త్వం కుపితా ఇతి = నీవు అలిగితివి అని (నీవు అలిగితివను వగచేత), అశనమ్ అపాస్తం = భోజనము మానఁబడినది (ఆహారము మానివైచితిని), యోషితాం కథా త్యక్తా = స్త్రీల ప్రస్తావము మానఁబడినది (మఱి యొకతెయాందైన అనురక్తుఁడ నని నీవు మఱియు కోపింతువో యని ఇతరస్త్రీలప్రస్తావ మైనను రానీయను), సురభయః స్రక్ గన్ధ ధూప ఆదయః దూరాత్ ఏవ వివర్జితాః = (నీయలుకకు పాత్రమయిన యీమదభాగ్య శరీరమునకు భోగములేల యని విరక్తుఁడనై) పరిమళవంతము లయిన పూలసరములు గంధములు ధూపములు మొదలయినవి దూరమునుండియే నిషేధింపఁబడినవి (స్రగాది భోగసాధనములను దగ్గఱకు రానీయకున్నాను), (హే) రాగిణి = ఓయనురాగవంతురాలా (లేక కోపవంతురాలా), కోపం ముఞ్చ = అలుక మానుము, అవనతే మయి దృష్టే = ప్రణతుఁడనయిన నేను చూడఁబడఁగా (ప్రణతుని నన్ను చూచి), అధునా ప్రసీద = ఇప్పుడు

కరుణగలదానవుకమ్మ, సత్యం = వాస్తవముగా, త్వత్ విరహాత్ = నీ తోడి యెడఁబాపువలన (నీవు లేనందున), మమ = నాకు, సర్వాః దిశః అన్ధాః భవన్తి = సకల దిక్కులు చీఁకటి అగుచున్నవి.

వీరి తగులాటమును చేటికలవలన నెఱిఁగి రాజు కొమరితను మందలించుచున్నాఁడు.—

నానారాజకుమారకాన్ గుణవతః
సంభావ్య మన్దిరే
కాలే భవ్యతరే స్వయంవరవిధౌ
చిత్తాపహర్త్రే ముదా
దత్త్వా త్వాం సుకృతీ భవేయ మితి మ
య్యాలోచనాతత్పరే,
త్వం మద్వంశకళఙ్క మఙ్కురయసే,
కిం వా కరోమ్యాత్మజే!

౭౮. ఆత్మజే = పుత్త్రీ, గుణవతః నానా రాజ కుమార కాన్ = విక్రమసౌందర్యాదిగుణశాలులయిన సకల రాజ పుత్త్రులను, మత్ మన్దిరే = నా యింట, సంభావ్య = సత్కరించి, భవ్యతరే కాలే = మిక్కిలిమంగళమయిన వేళలో, స్వయంవర విధౌ = స్వయంవర విధానమున, చిత్తాపహర్త్రే = (వారిలో) మనోహరుఁడగువానికి, ముదా = సంతోషముతో, త్వాం దత్త్వా సుకృతీ భవేయమ్ ఇతి = నిన్ను ఇచ్చి పుణ్యవంతుఁడను అగుదును గాక అని, మయి ఆలోచనా తత్పరే (సతి)= నేను ఆలోచనయందు ఆసక్తుఁడనై (యుండఁగా), త్వం మత్ వంశకళఙ్కమ్ అఙ్కురయసే = నీవు నావంశమునకు కళంకము మొలపించుచున్నావు, కింవా కరోమి = ఏమి చేయుదును!

ఇత్యుక్తా జనకేన ధీరవచనా,
సా ప్రత్యువాచ చేతి తం,

"స్వామిన్, సర్వ మిదం త్వ య్యైవ రచితం;
త్వద్వ్యాజ ఏవం తవ
చిత్తక్లేశకరో హ్యభూ; న్మమ పున
ర్జాతం శుభం, యత్ త్వయా
బద్ధః కాణ్డపటో, ద్రుతం సమభవత్
పాణిగ్రహ శ్చావయోః."

౭౯. జనకేన = తండ్రిచేత, ఇతి ఉక్తా (సతీ) = పూర్వశ్లోకములోనున్నప్రకారము చెప్పఁబడినదై, ధీరవచనా (సతీ) సా ఇతి తం ప్రత్యువాచ = తెంపరిమాటలుగల (దై) ఆమె యీప్రకారము ఆతనికి ఉత్తరము చెప్పెను — స్వామిన్ ఇదం సర్వం త్వయా ఏవ రచితం = ప్రభూ ఇది యంతయు నీచేతనే చేయఁబడినది, హి త్వత్ వ్యాజ ఏవం తవ చిత్త క్లేశ కరః అభూత్ = నిశ్చయముగా నీ మాయ ఇట్లు నీకు మనస్సునకు ఆయాసము చేయునది ఆయెను. మమ పునః = నాకు అయిననో, శుభం జాతం = కల్యాణ మయినది, యత్ = ఎందుచేత ననఁగా, త్వయా కాణ్డ పటః బద్ధః = నీచే తెర చీర కట్టఁబడినది, ద్రుతమ్ ఆవయోః చ పాణిగ్రహః సమభవత్ = వెంటనే మాకు ను వివాహము అయినది.

శ్రుత్వా తస్యా స్తదుక్తిం నరపతి రవదత్
"పుత్రికే, తావకీనం
సర్వం త ద్దుశ్చరిత్రం సకరుణహృదయః
సంసహే మత్సు తేతి;
త్వం చ త్యక్త్వా కుబుద్ధిం భవ శివహృదయా,
త్వాం ప్రదాస్యామి శీఘ్రం

సద్వంశ్యా యైవ భూపాలకతనయవరా”యేతి.
సా ప్యాహ భూయః.

టీ. నరపతిః = రాజు, తస్యాః తత్ ఉక్తిం శ్రుత్వా=ఆమె యొక్క ఆ మాటను విని, పుత్త్రికే = ఓసుమారీ, త్వం సుతా ఇతి = నీవు (నా) కొమారితవు గాన, సకరుణ హృదయః = దయతోఁగూడుకొన్న మనస్సుగలవాఁడనై, తావకీనం తత్ స ర్వం దుశ్చరిత్రం సంసహే = నీదైన యీ సమస్త దుర్వృత్తమును క్షమించెదను, త్వం చ కుబుద్ధిం త్యక్త్వా శివ హృదయా భవ = నీవు ను దుర్బుద్ధిని మాని మంగళమయిన మనస్సుగలదానవు కమ్ము, త్వాం శీఘ్రం = నిన్ను త్వరగా, సత్ వంశ్యాయ ఏవ భూపాలక తనయ వరాయ = మంచి వంశమువాఁడే అయిన రాజ కుమార శ్రేష్ఠునికి, ప్రదాస్యామి ఇతి = ఇచ్చెదను అని, అవదత్ = చెప్పెను. సా అపి భూయః ఆహ = ఆమె యు మరల చెప్పెను.

“దేవ, త్వం శృణు, చిత్త నేత్ర రసనా
ఘ్రాణ శ్రుతి స్పర్శనా
న్యాసక్తా తద్వశవర్తి తాని నితరా
మేవం మదీయాని వై.
కస్మై యచ్ఛసి చేతనావిరహితం
కాయం మదీయం వ దే”
త్యాకర్ణ్యాతిరుషా తతో నరపతి
ర్వేగా దపాగాత్ సభామ్.

టీ. దేవ త్వం శృణు = రాజా నీవు వినుము, ఏవం మదీ యాని చిత్త నేత్ర రసనా ఘ్రాణ శ్రుతి స్పర్శనాని = ఈ ప్రకార ము నా వైన మనస్సు కన్నులు నాలుక ఘ్రాణేంద్రియము వినికి తాఁ కుటయు, నితరాం తత్ వశ వర్తితాని ఆసక్తా = మిక్కిలి అతని

శిళములో ఉంపఁబడినవి అయినవి. చేతనా విరహితం మదీయం కాయం = చైతన్య హీనమయిన నాదైన దేహమును, కస్మై యచ్ఛసి వద ఇతి=ఎవరికి ఇచ్చెదవో చెప్పుము అని ; పూర్వశ్లోకముతో అన్వయము). ఆకర్ణ్య నరపతిః అతిరుషా తతః వేగాత్ సభామ్ అపాగాత్ = విని రాజు అతికోపముతో త్వరగా అక్కడినుండి సభకు పోయెను.

స్థిత్వాసనే భూపతి రిత్యువాచ
స కోటిపాలం ప్రతి "బిల్హణం కవిం
బద్ధ్వా శిర శ్ఛేదయ శీఘ్ర మస్య;
త్వం గచ్ఛ గ చ్ఛే"త్యవదత్ త్రివారమ్.

౫౨. సః భూపతిః = ఆ రాజు, ఆసనే స్థిత్వా = సింహాసనమందు కూర్చుండి, కోటిపాలంప్రతి = కోటిపాలుఁడనుపేరి కొత్వాలుతో, బిల్హణం కవిం బద్ధ్వా = బిల్హణ కవిని కట్టి, అస్య శిరః శీఘ్రం ఛేదయ ఇతి=వీని తలను త్వరగా కొట్టివేయింపుము అని, ఉవాచ = పలికెను. (కిం) చ = మఱి, త్వం గచ్ఛ గచ్ఛ ఇతి = నీవు పో పో అని, త్రివారమ్ అవదత్ = ముమ్మాఱు పలికెను.

కోటి పాలుఁడు చెప్పుచున్నాఁడు.—

కోపేన శాసితుం శక్తో యః ప్రసాదేన రక్షితుం
స ఏవ రాజా లోకస్య నేతరో జాతకిల్బిషః.

౫౩. యః = ఎవఁడు, కోపేన శాసితుం = కోపముచే దండించుటకు, ప్రసాదేన రక్షితుం (చ) కృపచే రక్షించుటకు (ను), శక్తః = సమర్థుఁడో, స ఏవ = అతఁడే, లోకస్య రాజా = లోకమునకు ప్రభువు, జాత కిల్బిషః ఇతరః న = పుట్టిన పాపముకల (దాఁడా

ర్హులను దండింపకయు అదండ్యులను దండించియు పాపము సంపాదించుకొన్న) యితరుఁడు (లోకమునకు రాజు) కాఁడు.

సాధు దేవ, త్వ యాజ్ఞప్తం
తత్ సమస్తం కరో మ్యహమ్.
తథాఽపి స్వామినా కార్యా
యోగ్యాయోగ్యవిచారణా.

౮౪. దేవ = ప్రభూ, సాధు = సరియే, అహం త్వయా ఆజ్ఞప్తం తత్ సమస్తం కరోమి = నేను నీచే ఆజ్ఞాపింపఁబడిన యాసమస్తమును చేసెదను, తథా అపి = కాని, స్వామినా = ఏలినవారిచే, యోగ్య అయోగ్య విచారణా కార్యా = యుక్తమా అయుక్తమా అనునాలోచన చేయఁదగినది (ఈపని యుక్తమో అయుక్తమో ఏలినవారు ఆలోచింపవలయును).

ఇ తీరితః కోటిపాలం విద్రావ్య ప్రాహిణో న్నృపః,
స బిల్హణకవిం బద్ధ్వా శ్మశానం ప్రయయౌ తతః.

౮౫. ఇతి ఈరితః = ఇట్లు చెప్పఁబడినవాఁడై, నృపః = రాజు, కోటిపాలం విద్రావ్య ప్రాహిణోత్ = కోటిపాలుని తఱిమిపంపెను. తతః = అంతట, సః = ఆకోటిపాలుఁడు, బిల్హణకవిం బద్ధ్వా = బిల్హణకవిని కట్టి, శ్మశానం ప్రయయౌ = శ్మశానమునకు పోయెను.

రాజు చూచి కనికరించి శిరశ్ఛేదాజ్ఞ మాపుచేయునుగాక యని కోటిపాలుఁడు బిల్హణుని రాచనగరవీథిని కొనిపోవుచుండఁగా ఆవృత్తాంతము చేటికలవలన నెఱిఁగి యామినీపూర్ణతిలక దుఃఖితురాలై ద్వారమునకు వచ్చి కొత్వాలుచే నీయమానుఁడైనకవిని బాష్పాకులలోచన యై చూచుచుండఁగా కవి ఆమెను గూర్చి యిట్లు పలుకుచున్నాఁడు.—

అయి కి మనిశం బాలే ద్వారే సమున్నతకన్ధరా
కువలయదళస్నిగ్ధే ముగ్ధే విముఞ్చసి లోచనే?
అమరరమణీలీలావల్గద్విలోకనవాగురా
వలయపతితో నవ్యావృత్తిం క్వ యాస్యతి బిల్హణః?

౮౬. అయి ముగ్ధే బాలే = ఓ తెలియని పిల్లా, సమున్నత కన్ధరా = లేచిన మెడగలదానవై (మెడయెత్తి), కువలయ దళ స్నిగ్ధే లోచనే = కలువ రేకులవలె తళుకుగల నేత్రములను, ద్వారే = ద్వారమున, అనిశం = సదా, కిం విముఞ్చసి = ఏల ప్రయోగించుచున్నావు? అమర రమణీ లీలా వల్గత్ విలోకన వాగురా వలయ పతితః = దేవ స్త్రీల విలాసయుక్తమయిన చంచలమయిన చూపులయొక్క వలల వలయములలో పడిన, బిల్హణః = బిల్హణుఁడు, నవ్య ఆవృత్తిం క్వ యాస్యతి = క్రొత్త రాకను ఎక్కడ పొందును. 'దేవస్త్రీలచూపులవలలో తగులుకొన్నాఁడు' అనుటచే చావు నిక్కమని యభిప్రాయము.

తా.—బిల్హణునికి ఇప్పుడు చావు తప్పదు. నీవు ఇఁక నతనిని చూడవు.

గత్వా శ్మశాన మథ బిల్హణపణ్డితోఽపి
తత్రోపవిశ్య సకలా శ్చ దిశో విలోక్య
మన్దస్మితో నృపతిపూరుష మాహ సాసిం
'ఛిన్ధ్యాశు భద్ర మమ మస్తక మి' త్యుదారమ్.

౮౭. అథ = పిమ్మట, బిల్హణ పణ్డితః అపి = బిల్హణ పండితుఁడు ను, శ్మశానం గత్వా=వల్లకాటికి పోయి, తత్ర ఉపవిశ్య = అచట కూర్చుండి, సకలాః దిశః విలోక్య చ = అన్ని దిక్కులను చూచియు, మన్ద స్మితః = చిఱునగవుగలవాఁడై, సాసిం = కత్తి గలవాఁడయిన, నృపతిపూరుషం = కొత్వాలును, = ఓయి

సౌమ్యుఁడా, మమ మస్తకమ్ ఆశు ఛిన్ ద్ధి = నా తలను త్వరగా కోయుము, ఇతి = అని, ఉదారమ్ = గొప్పతనముతో, ఆహ = పలికెను.

కిం కారణం కవివరేణ్య, దరస్మితోఽసి ?
భీతి ర్న కిం తవ?—భవిష్యతి భీః కథం వా?
ఉత్ఫుల్లలోచనలసద్వదనారవిన్దా
దేవీ యదీయహృదయే నివస త్యజస్రమ్?

౮౮. కోటిపాలుఁడు.— కవివరేణ్య దర స్మితః అసి కిం కారణం = కవిశ్రేష్ఠుఁడా చిఱునగవుగలవాఁడవుగా నున్నావు ఏమి కారణము? తవ భీతిః న కిమ్ = నీకు భయము లేదేమి? కవి.—ఉత్ఫుల్ల లోచన లసత్ వదన అరవిన్దా = వికసించిన నేత్రములచే ప్రకాశించుచున్న ముఖ కమలముగలదై, దేవీ = దేవత (యామినీపూర్ణతిలక) యదీయ హృదయే అజస్రం నివసతి = ఎవని హృదయమందు సదా నివసించునో, మే = (అట్టి) నాకు, భీః కథం భవిష్యతి = భయము ఎట్లు కలుగును ? (నామనస్సులో యామినీపూర్ణతిలకను స్మరించుట యనువృత్తి భయవృత్తికి అవకాశ మీయక యున్నది.

తాం దేవతాం స్మరవిసృత్వరచారుశోభాం
గణ్డస్థలద్వితయరాజితపత్త్రవల్లీమ్
ఉత్తుఙ్గపీనకఠినస్తనమధ్యసంస్థ
హారావళీం గుణవతీం సతతం స్మరామి.

౮౯. తాం దేవతాం = ఆ దేవతను (యామినీపూర్ణతిలకను) స్మర విసృత్వర చారు శోభాం = మన్మథునిచేత వ్యాపించుచున్న యందమయిన కాంతిగలదానిని, గణ్డ స్థల ద్వితయ రాజిత పత్త్రి వల్లీం = చెక్కిళ్ల ప్రదేశములు రెండింటను ప్రకాశించుచున్న

మకరికాదిపత్త్రిలతలుగలదానిని, ఉత్తుఙ్గ పీన కఠిన స్తన మధ్య సంస్థ హార ఆవళీం=ఉన్నతములు వలుఁదలు గట్టివియు నగు కుచముల నడుమ నున్న ముత్తెముల పేరుల సమూహము కలదానిని, గుణవతీం = గుణములకలదానిని, సతతం స్మరామి = సర్వదా స్మరించు చున్నాను.

అద్యాపి తాం కనకచమ్పకదామగౌరీం
ఫుల్లారవిన్దనయనాం తనురోమరాజిం
సుప్తోత్థితాం సురతవిహ్వలసాలసాఙ్గీం
విద్యాం ప్రమాదగళితామివ చిన్తయామి.

౯౦. తాం=ఆచెలువను, కనక చమ్పక దామ గౌరీం = బంగారమువలెను సంపెంగదండవలెను పచ్చనిదానిని, ఫుల్ల అరవిన్ద నయనాం = వికసించిన తామరలవంటి నేత్రములుగలదానిని, తను రోమ రాజిం=సన్నమైన నూఁగారుకలదానిని, సుప్త ఉత్థితాం = నిద్రించి మేలుకొన్నదానిని, సురత విహ్వల సాలస అఙ్గీం = సురత క్రీడచే వివశములును బడలినవియు నగు అవయములు గలదానిని, ప్రమాద గళితాం విద్యామ్ ఇవ = పరాకుచే పోయిన చదువునుం బోలె, అద్యాపి=ఇప్పుడును, చిన్తయామి = తలపోయుచున్నాను.

అద్యాపి త ద్వికసితామ్బుజమధ్యగౌరం
గోరోచనాతిలకపాటలఫాలదేశమ్
ఈషన్మదాలసవిఘూర్ణితదృష్టిపాతం
కాన్తాముఖం ప్రతి మనో మమ సన్నిధత్తామ్.

౯౧. వికసిత అమ్బుజ మధ్య గౌరమ్ = వికసించిన తామర యొక్క లోపలిభాగమువలె పచ్చనిదియు, గోరోచనా తిలక పాటల ఫాల దేశం = గోరోచనపు బొట్టుచే ఎఱ్ఱనయిన లలాట స్థలము కలదియు, ఈషత్ మద అలస విఘూర్ణిత దృష్టి పాతం=కొంచెము

మదముచే అలసములయిన సుడియుచున్న చూపుల వ్యాప్తికల దియు, (అయిన) తత్ కాన్తాముఖం ప్రతి = ఆప్రియురాలిముఖ మును గూర్చి (అనఁగా ప్రియురాలియాముఖమందు) మమ మనః= నా మనస్సు, అద్యాపి = ఇప్పుడును, సన్నిధత్తామ్ = ఉండును గాక.

అద్యాపి తత్ కనకకుణ్డలమృష్టగణ్డ
మాస్యం స్మరామి విపరీతరతాభియోగే
ఆన్దోళన శ్రమజలస్ఫుటసాన్ద్రబిన్దు
ముక్తాఫలప్రకరవిస్ఫురితం ప్రియాయాః.

౯౨. విపరీత రత అభియోగే = పూరుషాయిత క్రీడయందలి పైకొనుటలో, కనక కుణ్డల మృష్ట గణ్డం = బంగారు కర్ణభూషణ ములచేత ఒరసికొనఁబడిన చెక్కిళ్లుగలదియు, ఆన్దోళన శ్రమ జల స్ఫుట సాన్ద్ర బిన్దు ముక్తాఫల ప్రకర విస్ఫురితం = ఊఁగుటచే కలిగిన చెమటయొక్క స్పష్టమయిన దట్టమయిన బొట్టులనెడు ముత్తెముల సమూహముచేత ప్రకాశించినదియు, (అయిన), ప్రియా యాః తత్ ఆస్యం = ప్రియయొక్క ఆ ముఖమును, స్మరామి = తల పోయుచున్నాను.

అద్యాపి తాం శశిముఖీం నవయావనాఢ్యాం
పీన స్తనీం ఘనకచా మతిగౌర కాన్తిం
పశ్యామి మన్మథఖరానలపీడితాని
గాత్రాణి యా మమ కరోతి సుశీతలాని.

౯౩. మన్మథ ఖర అనల పీడితాని = మదనుఁడనెడు తీవ్రమైన అగ్నిచే బాధింపఁబడినవైన, మమ గాత్రాణి = నా యవయవము లను, సుశీతలాని యా కరోతి = మిగుల చల్లనివానినిగా ఎవతె చేయునో, తాం = ఆ, శశిముఖీం = చంద్రవదనను, నవ

యౌవన ఆఢ్యాం = క్రొత్త ప్రాయము గలదానిని, పీన స్తనీం = బలుఁద కుచములుగలదానిని, ఘనకచాం = గొప్ప (లేక, మేఘము వంటి) తలకట్టుగలదానిని, అతి గౌర కాన్తిం = మిగుల పచ్చని ప్రకాశముకలదానిని, అద్యాపి = ఇప్పుడును, పశ్యామి = చూచు చున్నాను.

అద్యాపి త న్మనసి సంపరివర్తతే మే
రాత్రౌ మయి క్షుతవతి క్షితిపాలపుత్ర్యా
జీ వేతి మఙ్గళవచః పరిహృత్య రోషాత్
కర్ణేఽర్పితం కనకప త్త్ర మనాలపన్త్యా.

౬౮. రాత్రౌ మయి క్షుతవతి (సతి) = రాత్రియందు నేను తుమ్మఁగా, రోషాత్ = కోపముచేత, జీవ ఇతి మఙ్గళ వచః పరిహృత్య = 'చిరం జీవ' అను శుభ వచనమును మాని, అనాలపన్త్యా= పలుకనిదైన, క్షితిపాల పుత్ర్యా = (ఆ) రాజ కన్యచేత, మే కర్ణే = నా చెవియిందు కనక పత్త్రమ్ అర్పితమ్ (ఇతి యత్) = బంగారు కమ్మ ఉంపఁబడె (ననుట ఏది కలదో), తత్ = అది అద్యాపి=ఇప్పుడును, మనసి=(నా) మనస్సులో, సం పరివర్తతే = చక్కఁగా నున్నది.

ఒకనాఁడు రాత్రి పొలయలుకచే యామినీపూర్ణతిలక బిల్హణుని తో మాట లాడక యుండఁగా, బిల్హణుఁడు ఆమె యనురాగమును పరీక్షించుటకై తుమ్మెను. అంత నామె 'చిం జీవ' అని నోట చెప్పక తదభిప్రాయసూచకముగా అతని చెవికి సువర్ణపత్త్రమును తగిలించెను. ఆమెకు అతనియందు అంత యనురక్తి యుండెను, అని భా.

అద్యాపి తాం యది పునః కమలాయతాక్షీ
ముత్తుఙ్గపీవరపయోధరభారఖిన్నాం

సంపీడ్య బాహుయుగళేన పిబామి వక్త్రి
మున్మత్తబమ్బర ఇ వామ్బురుహం య థేష్టమ్.

౫౫. పునః యది=మరల సంభవించు నేని, ఉత్తుఙ్గ పీవర పయోధర భార ఖిన్నాం = ఉన్నతములు వలుదలు నగుకుచముల బరువుచే బడలిన, తాం=ఆయామినీపూర్ణతిలకను, బాహు యుగళేన = బాహువుల జతచేత, సంపీడ్య=బిగించి, ఉన్మత్త బమ్బరః అమ్బురుహమ్ ఇవ = వెఱ్ఱి తుమ్మెద తామరను బోలె, వక్త్రిమ్ = (ఆచెలి) ముఖమును, అద్యాపి=ఇప్పుడును, యథేష్టం = తనివితీఱ, పిబామి = త్రాగెదను (ముద్దుపెట్టుకొనియెదను).

అద్యాపి తాం కుటిలకోమలకాలకేశీ
మున్నిద్రతామరసపత్త్రవిశాలనేత్రాం
ప్రోత్తుఙ్గపీవరకఠోరపయోధరాఢ్యాం
ధ్యాయామి చేతసి యథైవ గురూక్తవిద్యామ్.

౫౬. కుటిల కోమల కాల కేశీం = వంకరలును సుకుమారములు నల్లనివియు నయిన వెండ్రుకలు గలదియు, ఉన్నిద్ర తామరస పత్త్రి విశాల నేత్రాం = వికసించిన తామరపూవుయొక్క రేకులవలె విరివియైన కన్నులుగలదియు, ప్రోత్తుఙ్గ పీవర కఠోర పయోధరాఢ్యాం = ఉన్నతములు వలుదలు గట్టివియు నగు కుచములు గలదియు, (అయిన) తాం = ఆమెను, చేతసి = మనస్సులో, అద్యాపి = ఇప్పుడును, గురు ఉక్త విద్యాం యథా ఏవ = గురువుచే చెప్పఁబడిన విద్యను ఏప్రకారమో ఆప్రకారమే, ధ్యాయామి =ధ్యానించుచున్నాను.

అద్యాపి తన్ముకుళకున్దసమానదన్తం
తిర్యగ్వివర్తితవిలోలవిలోచనాన్తం
తస్యా ముఖం త్వతితరాం న హి విస్మరామి
చిత్తే కృతజ్ఞ ఇవ సాధుకృతోపకారమ్.

౫౭. ముకుళ కున్ద సమాన దన్తం = మొగ్గలయిన మల్లెలతో సమానము లయిన దంతములు గలదియు, తిర్యక్ వివర్తిత విలోల విలోచన అన్తం = అడ్డముగా త్రిప్పఁబడిన చంచలమయిన చూపుల కొనలుగలదియు, (అయిన), తస్యాః ముఖం = ఆచెలి ముఖమును, అద్యాపి = ఇప్పుడును, చిత్తే = మనస్సులో, కృతఘ్నః = తనకు చేసినమేలు మఱవనివాఁడు, సాధు కృత ఉపకారమ్ ఇవ = సజ్జనులచే చేయఁబడిన మేలును బోలె, అతితరామ్ న విస్మరామి హి = బొత్తిగా మఱవను జుమా.

అద్యాపి తన్మదనకార్ముకలగ్నభృఙ్గ
బృన్దద్యుతిప్రకరకర్బురితాలకాన్తమ్
కర్ణావసక్తవిమలోజ్జ్వలదన్తపత్త్రాం
తస్యాః పునః పున రపీహ ముఖం స్మరామి.

౫౮. మదన కార్ముక లగ్న భృఙ్గ బృన్ద ద్యుతి ప్రకర కర్బురిత అలక అన్తం = మన్మథుని వింటియందు తగిలియున్న తుమ్మెదల సమూహముయొక్క కాంతి మొత్తముచేత నల్లనిదైన ముంగురుల కొనలుగలదియు, కర్ణ అవసక్త విమల ఉజ్జ్వల దన్త పత్త్రాం = చెవియందు తగిలియున్న తెల్లని ప్రకాశమానమయిన దన్తమయమయిన చెవికమ్మగలదియు, (అయిన), తస్యాః తత్ ముఖం అద్యాపి పునః పునః అపి ఇహ స్మరామి = ఆప్రియయొక్కఆ ముఖమును ఇప్పుడును మరలమరల ను ఇక్కడ తలంచుచున్నాను.

అద్యాపి తాం ఝడితి వక్రితకన్ధరాఢ్యాం
నిక్షిప్తపాణికమలాన్తనితమ్బబిమ్బామ్
వామాంసపార్శ్వలసదుల్బణకేశపాశాం
పశ్యామి మాం ప్రతి దృశం బహుధాక్షిపన్తీమ్.

౫౯. ఝడితి వక్రిత కన్ధరాఢ్యాం = త్వరగా వంపఁబడిన మెడ గలదియు, నిక్షిప్త పాణి కమల అన్త నితమ్బ బిమ్బాం = ఉంపఁ

బడిన కేలు దామరచేత రమణీయమైన శ్రోణీ మండలముగలదియు, వామ అంస పార్శ్వ లసత్ ఉల్బణ కేశపాశాం =. ఎడమ బుజము ప్రక్కను ఒప్పుచున్న గొప్ప తలవెండ్రుకలభారముగలదియు, (అయి), మాం ప్రతి బహుధా దృశం క్షిపన్తీం = నా వైపు బహు ప్రకారములుగా చూపును నిగిడించుచున్న, తామ్=ఆప్రియను, అద్యాపి పశ్యామి = ఇప్పుడును చూచుచున్నాను.

అద్యాపి తత్ సరలమఞ్జులతుఙ్గనాసం
కిఞ్చిత్ స్ఫుటోల్లసితమాంసలపాణ్డుగణ్డామ్
పశ్యామి పూర్ణశరదిన్దుసమానకాన్తి
కాన్తాముఖం వికచపఙ్కజపత్త్రనేత్రమ్.

౧౦౦. సరళ మఞ్జుల తుఙ్గ నాసం = తిన్నని అందమయిన ఉన్నతమయిన ముక్కుగలదియు, కిఞ్చిత్ స్ఫుట ఉల్లసిత మాంసల పాణ్డు గణ్డం = కొంచెము స్పష్టమయిన చలించిన పుష్టిగల తెల్లని చెక్కిళ్లుగలదియు, పూర్ణ శరత్ ఇన్దు సమాన కాన్తి = అన్నికళలునిండిన శరత్కాలపుఁ జంద్రునితో సమమయిన శోభగలదియు, వికచ పఙ్కజ పత్త్ర నేత్రం = వికసించిన తామర రేకులవంటి కన్నులుగలదియు నయిన, తత్ = ఆ, కాన్తా ముఖం = ప్రియయొక్క ముఖమును, అద్యాపి = ఇప్పుడును, పశ్యామి= చూచుచున్నాను.

అద్యాపి తా మవిగణయ్య కృతాపరాధం
మాం పాదమూలపతితం బహుధా క్షిపన్తీం
వస్త్రాఞ్చలం మమ కరా న్నిజ మాకృషన్తీం
మా మేతి రోషపరుషం సుదతీం స్మరామి.

౧౦౧. కృత అపరాధం పాద మూల పతితం మామ్ = చేసిన నేరముగలవాఁడనై (నేరముచేసినవాఁడనై) పాదముల యొద్ద పడిన నన్ను, అవిగణయ్య బహుధా క్షిపన్తీం= లక్ష్యపెట్టక అనేకవిధముల దూషించుచున్న దానిని, మమ కరాత్ నిజం వస్త్ర అఞ్చలమ్ ఆకృ

పక్షీం = నా చేతినుండి తన చీరయొక్క అంచును లాఁగుకొనుచున్న దానిని, మా మా ఇతి రోష పరుషం రుదతీం = వలదు వలదు అని కోపముచే కఠినముగా ఏడ్చుచున్నదానిని, అద్యాపి స్మరామి = ఇప్పుడును తలంచుచున్నాను.

అద్యాపి తా మతివిశాలనితమ్బబిమ్బాం
గమ్భీరనాభికుహరాం తనుమధ్యభాగామ్
అమ్లానకోమలమృణాలసమానబాహుం
లీలాలసాఞ్చితగతిం మనసా స్మరామి.

౧౦౨. అతి విశాల నితమ్బ బిమ్బాం = మిక్కిలి గొప్పలయిన పిఱుఁదుల మండలముగలదియు, గమ్భీర నాభి కుహరాం = లోఁతయిన పొక్కిటియొక్క రంధ్రముగలదియు, తను మధ్య భాగాం = సన్నని నడుము ప్రదేశము గలదియు, అమ్లాన కోమల మృణాల సమాన బాహుం = వాడని మృదువయిన తామరతూండ్లతో సమానమయిన భుజములుగలదియు, లీలా అలస అఞ్చిత గతిం = విలాసముచే మందమయిన సొంపయిన నడకగలదియు, (నయిన), తామ్ = ఆకాంతను, అద్యాపి మనసా స్మరామి = ఇప్పుడును మనస్సులో తలంచుచున్నాను.

అద్యాపి తత్ లలితచారునిమీలితాక్షం
వక్త్రం స్మరామి సరసం సురతావసానే
తత్కాలనిశ్వసితవాతవిఘూతకాన్త
స్వేదోదబిన్దుపటలస్ఫురితం ప్రియాయాః.

౧౦౩. సురత అవసానే = క్రీడయొక్క అంతమందు, లలిత చారు నిమీలిత అక్షం = ఒప్పుచున్న అందమయిన మూసికొన్న కన్నులుగలదియు, సరసం = రసముగలదియు, తత్ కాల నిశ్వసిత వాత విఘూత కాన్త స్వేద ఉద బిన్దు పటల స్ఫురితం = ఆ సమయముయొక్క ఊపిరి గాలిచే ఎగురఁగొట్టఁబడిన అందమయిన

చెమరు నీటి బొట్టుల సమూహముచేత ప్రకాశించినదియు, (నయిన), ప్రియాయాః తత్ వక్త్రం = ప్రియయొక్క ఆ ముఖమును, అద్యాపి స్మరామి = ఇప్పుడును తలఁచుచున్నాను.

అద్యాపి తాం మయి కృతాగసి రుష్టభావాం
బాష్పామ్బుసంతతిముహుర్నిగృహీతవాచమ్
అన్తర్నిరుద్ధఘనమన్యుసబాష్పకణ్ఠీం
నిశ్వాసశుష్యదధరాం రుదతీం స్మరామి.

౧౦౪. మయి కృత ఆగసి (సతి) = నేను చేయఁబడిన తప్పుగల వాఁడను (కాఁగా), రుష్ట భావాం = కోపగించిన మనస్సుగలదియు, బాష్ప అమ్బు సంతతి ముహుర్ నిగృహీత వాచం = అశ్రు జలము యొక్క ప్రవాహముచే మాటిమాటికి అడ్డగింపఁబడిన మాటగలదియు, అన్తర్ నిరుద్ధ ఘన మన్యు సబాష్ప కణ్ఠీం = మనస్సులో నిముడుచు కొనఁబడిన గొప్ప దుఃఖముచేత బాష్పములుఁగల గొంతుగలదియు, నిశ్వాస శుష్యత్ అధరాం = ఊపిరిచేత ఎండుచున్న కెమ్మోవి గలదియు, (నై), రుదతీం తామ్ = ఏడ్చుచున్న యాసకిని అద్యాపి స్మరామి = ఇప్పుడును తలఁచెదను.

అద్యాపి తాం మదపనీతనితమ్బవస్త్రాం
పశ్యామిసాధ్వసరసాకులవిహ్వలాఙ్గీమ్
ఏకేన పాణికమలేన పిధాయ గుహ్యా
మన్యేన నాభికుహరం దధతీం స్మరామి.

౧౦౫. మత్ అపనీత నితమ్బ వస్త్రాం = నాచే లాఁగివైవ బడిన పిఱుఁదులమీఁది చీరగల (దై), (అందుచేతనే), సాధ్వస రస ఆకుల విహ్వల అఙ్గీం = లజ్జచేతను రాగముచేతను కలఁగిన తబ్బిబ్బయిన దేహముగలదియు (నై), ఏకేన పాణి కమలేన = తామర వంటి యొక చేతితో, గుహ్యాం పిధాయ = వరాంగమును మూసి

కొని, అన్యేన నాభి కుహరం దధతీం తామ్ = రెండవదానితో పొక్కిలి రంధ్రమును మూసికొనుచున్న యాప్రేయసిని, అద్యాపి స్మరామి = ఇప్పుడును తలంచుచున్నాను.

అద్యాపి తాం రహసి దర్పణవీక్ష్యమాణ
సంక్రాన్త మత్ప్రతినిధిం మయి పృష్ఠలగ్నే
పశ్యామి వేపథుమతీం చ ససంభ్రమాం చ
లజ్జాకులాం చ సముదఞ్చితమన్మథాం చ.

౧౦౬. రహసి = ఏకాంతమందు, మయి పృష్ఠ లగ్నే = నేను వెనుక నిలిచియుండఁగా, దర్పణ వీక్ష్యమాణ సంక్రాన్త మత్ ప్రతినిధిం = అద్దమందు చూడఁబడిన (అద్దములో) తగిలిన నా ప్రతిబింబముకలదై (నాప్రతిబింబమును అద్దములో చూచి), వేపథుమతీం చ = వణుఁకుగలది యు, ససంభ్రమాం చ =తొట్రుపాటుగలదియు, లజ్జ ఆకులాం చ = సిగ్గుచే కలఁగినదియు, సముదఞ్చిత మన్మథాం చ = మిక్కిలి రేఁగిన మదనరసముగలదియు, (నయిన), తామ్ = ఆ సఖిని, అద్యాపి, పశ్యామి = చూచుచున్నాను.

అద్యాపి తాం సురభిదర్దురగణ్డభాగం
ధావన్త మాస్యకమలం ప్రతిచఞ్చరీకమ్
కిఞ్చిచ్చలచ్చకితకుఞ్చితచారునేత్రాం
పశ్యామి కేళికమలేన నివారయన్తీమ్.

౧౦౭. సురభి దర్దుర గణ్డ భాగం = పరిమళవంతమయి గగురొప్పిడిచిన కపోల ప్రదేశముగల, ఆస్య కమలం ప్రతి = ముఖ తామరసము మీఁదికి, ధావన్తం చఞ్చరీకం = ఎగురుచున్న తుమ్మెదను, కిఞ్చిత్ చలత్ చకిత కుఞ్చిత చారు నేత్రాం = కొంచెము కదలుచున్న బెదరిన ముడుఁచుకొనఁబడిన అందమయిన కనులుగలదై, కేళి కమలేన = విలాసార్థము చేతఁబూనిన తామరతో, నివారయన్తీం =

తోలినైచుచున్న, తామ్ = ఆప్రియను, అద్యాపి పశ్యామి = ఇప్పుడును చూచుచున్నాను.

అద్యాపి తాం మయి గతే పురత శ్చ పశ్చా
దన్త ర్బహిః పరిత ఏవ పరిభ్రమన్తీమ్
పశ్యామి ఫుల్లకనకామ్బుజకోమలేన
వక్త్రేణ తిర్యగనువర్తితలోచనేన.

౧౦౫. మయి గతే = నేను వెడలిపోఁగా, ఫుల్ల కనక అమ్బుజ కోమలేన = వికసించిన బంగారు కమలమువలె మృదులమును, తిర్యక్ అనువర్తిత లోచనేన = అడ్డముగా త్రిప్పఁబడిన నేత్రములు గలదియు, (నగు), వక్త్రేణ = ముఖముకలదై, పురతః చ పశ్చాత్ అన్తః బహిః పరితః ఏవ = ముందును వెనుకను లోపల వెలుపల అంతట ను, పరిభ్రమన్తీం = తిరుగుచున్న, తామ్ అద్యాపి పశ్యామి = ఆకాంతను ఇప్పుడును చూచుచున్నాను.

అద్యాపి తాం మయి కవాటసమీపలీనే
మన్మార్గదత్తదృశ మాననదత్తహస్తామ్
మద్గోత్రచిహ్నితపదాం మృదుకాకలీభిః
కిఞ్చిత్తరఙ్గమనసా మనసా స్మరామి.

౧౦౬. మయి కవాట సమీప లీనే = నేను తలుపు దగ్గఱ దాఁగి యుండఁగా, మత్ మార్గ దత్త దృశమ్, నా దారివైపు నిగిడింపఁబడిన చూపుగలదియు, ఆనన దత్త హస్తాం = ముఖమున ఉంపఁబడిన చేయిగలదియు (అనఁగా అరచేతియందు చెక్కిలి యుంచుకొని యున్నదియు), మృదు కాకలీభిః = కోమలమయిన సూక్ష్మమధుర స్వరములతో, కిఞ్చిత్ తరఙ్గ మనసా = కొంచెము అలలుగలదైన (కోర్కులుగలదైన) మనస్సుతో (కూడుకొన్నదై), మత్ గోత్ర చిహ్నిత పదాం = నా పేరు గుర్తుగాఁగల పాటగలదియు, (నయిన),

తామ్ = ఆమెను, అద్యాపి = ఇప్పుడును, మనసా = మనస్సున, స్మరామి = స్మరించుచున్నాను.

అద్యాపి తాని మమ చేతసి సంస్ఫురన్తి
కర్ణాన్తసంగతకటాక్షనిరీక్షణాని
తస్యాః స్మరజ్వరహరాణి మదాలసాఙ్గ్యా
లీలావిలాసచటులాని విలోకనాని

౧౧౦. మద అలస అఙ్గ్యాః = మదనునిచే బడలిన దేహముగల, తస్యాః=ఆ సుందరియొక్క, కర్ణ అన్త సంగత కటాక్ష నిరీక్షణాని= చెవుల కొనను అంటిన కడకంటి చూపులుగలవియు, స్మర జ్వర హరాణి = మదన జ్వరమును పోఁగొట్టునవియు, లీలా విలాస చటులాని = హొయలుచేతను లీలచేతను చపలములును, (అయిన), తాని విలోకితాని = ఆ చూపులు, అద్యాపి, మమ చేతసి సం స్ఫురన్తి = నా మనస్సులో చక్కఁగా స్ఫురించుచున్నవి.

అద్యాపి తత్ తరళతారకితాక్ష మాస్య
మాలిప్తచన్దనరసాహితశోభ మస్యాః
కస్తూరికాచటులపత్త్రిలతాభిరామ
గణ్డస్థలద్యుతి ముహుర్మనసా స్మరామి.

౧౧౧. తరళ తారకిత అక్షం = చంచలములయిన నల్లగ్రుడ్లుగల నేత్రములు గలదియు, ఆలిప్త చన్దన రస ఆహిత శోభం = పూయఁ బడిన గందపు ద్రవముచేత కలుగఁజేయఁబడిన కాంతిగలదియు, కస్తూరికా చటుల పత్త్రి లతా అభిరామ గణ్డ స్థల ద్యుతి = కస్తూరితో వ్రాసిన అందమయిన మకరికాదిపత్త్రిముల తీఁగలచే రమ్యమయిన చెక్కిళ్ల ప్రదేశముల కాంతి గలదియు, (నయిన), అస్యాః= ఆ చెలియొక్క, తత్ ఆస్యమ్ = ఆ ముఖమును, ముహుఃముహుః =

మాటిమాటికి, మనసా = మనస్సులో, అద్యాపి, స్మరామి తలంచు చున్నాను.

అద్యాపి తత్ కుచకచగ్రహణాగ్రహేణ
దన్తై ర్మయా దశనవాససి పీడ్యమానే
తస్యాః సకృన్ముకుళితాక్ష మలక్ష్యమాణ
సీత్కారగర్భ మసకృ ద్వదనం స్మరామి.

౧౧౨. కుచ కచ గ్రహణ ఆగ్రహేణ = స్తనములను కొప్పును పట్టుకొన్న పట్టుతో, మయా = నాచే, దన్తైః = దంతములతో, దశనవాససి = అధరోష్ఠము, పీడ్యమానే = కఱవఁబడుచుండఁగా (నేను కుచకచములను బిగియఁబట్టుకొని కెమ్మోవిని ఆనుచుండఁగా), సకృత్ ముకుళిత అక్షమ్ = తటాలున మూసికొనఁబడిన నేత్రములు గలదియు, అలక్ష్యమాణ సీత్కార గర్భం = తెలియరాని సీత్కారము గలదియు, (అయిన), తస్యాః తత్ వదనమ్ = ఆమెయొక్క ఆ ముఖమును, అసకృత్ = పలుమాఱు, అద్యాపి స్మరామి= ఇప్పుడును స్మరించుచున్నాను.

అద్యాపి తాని హృదయే మమ సంస్ఫురన్తి
బిమ్బోష్ఠదేశపరికీర్ణశుచి స్మితాని
పీయూషపూరమధురాణి చటూని తాని
వాక్యాని మన్మథరసేన మృదూని తస్యాః.

౧౧౩. బిమ్బ ఓష్ఠ దేశ పరికీర్ణ శుచి స్మితాని = దొండపండు వంటి పెదవి ప్రదేశమందు వెదచల్లఁబడిన తెల్లని మందహాసములు గలవియు, పీయూష పూర మధురాణి = అమృత ప్రవాహమువలె తీయనివియు, చటూని = నిపుణములును, మన్మథ రసేన మృదూని= మదన రసముచేత సుకుమారములును, (అయిన), తస్యాః తాని వాక్యాని = ఆ చెలువయొక్క ఆ మాటలు, అద్యాపి, మమ

హృదయే సంస్ఫురన్తి = నాహృదయములో చక్కఁగా స్ఫురించు చున్నవి.

అద్యాపి తాం కనకపత్త్రసునద్ధకర్ణా
ముత్తుఙ్గకర్కశకుచార్పితతారహారామ్
కాఞ్చీనియన్త్రితవిశాలనితమ్బబిమ్బా
ముద్దామనూపురరణచ్చరణాం స్మరామి.

౧౧౮. కనక పత్త్ర సునద్ధ కర్ణాం=పసిఁడి యాకుచేత చక్కఁగా కట్టఁబడిన చెవిగలదానిని (అనఁగా - చెవియందు పసిఁడికమ్మను ధరించినదానిని), ఉత్తుఙ్గ కర్కశ కుచ అర్పిత తార హారాం = ఉన్నతములును కఠినములును అయిన స్తనములయందు ధరింపఁబడిన ముత్యాల హారములు గలదానిని, కాఞ్చీ నియన్త్రిత విశాల నితమ్బ బిమ్బాం = మొలనూలిచే కట్టఁబడిన గొప్ప పిఱుఁదుల మండలము గలదానిని, ఉద్దామ నూపుర రణత్ చరణాం = ఉత్కటములయిన అందెలచే మ్రోయుచున్న పాదములుగలదానిని, తామ్ అద్యాపి, స్మరామి = ధ్యానించుచున్నాను.

అద్యాపి తాం భుజలతార్పితకణ్ఠభాగాం
వక్షఃస్థలం మమ పిధాయ పయోధరాభ్యామ్
ఈషన్నిమీలితవిలోలవిలోచనాన్తాం
పశ్యామి మద్దశనచేలక మాపిబన్తీమ్.

౧౧౯. భుజ లతా అర్పిత కణ్ఠభాగాం = తీఁగలవంటి బాహుల యందు ఉంపఁబడిన నామెడ ప్రదేశముగలదై (అనఁగా, బాహు లతో నామెడను కౌఁగిలించుకొని), మమ వక్షః స్థలం = నా హృదయ దేశమును, పయోధరాభ్యాం = చన్నులతో, పిధాయ= కప్పి, ఈషత్ నిమీలిత విలోల విలోచన అన్త = కొంచెము మూయఁబడిన చంచలములయిన కనుఁగొనలు గలుగునట్లుగా, (అర్ధనిమీలిత నేత్రయై), మత్ దశనచేలకమ్ = నా యధరోష్ఠమును,

మరల, వదన్తీం=పలుకుచున్న, తామ్, అద్యాపి, స్మరామి = తలంచుచున్నాను.

అద్యాపి తాం చిరగతే మయి కామభారా
చ్ఛయ్యాం సమాగతవతీం పరివర్తమానామ్
ద్వారి స్థితాం కి మపి సంవలితాం నిషణ్ణాం
సఖ్యా సమాగతవతీం రుదతీం స్మరామి.

౧౨౦. మయి చిరగతే (సతి) = నేను ఆలస్యము చేసినవాఁడను కాఁగా, కామ భారాత్ = మదన భరముచేత, శయ్యాం సమాగతవతీం = పాన్పు చేరి, పరివర్తమానాం = దొర్లుచున్న దానిని, ద్వారి స్థితాం = ద్వారములో నిలిచి, కిమ్ అపి సంవలితాం నిషణ్ణాం = ఏమో ముణుఁచుకొని కూర్చున్న దానిని, సఖ్యా సమాగతవతీం రుదతీం = చెలితో కలసికొన్నదై ఏడ్చుచున్న దానిని, తామ్ = ఆప్రియను, అద్యాపి, స్మరామి = ధ్యానించుచున్నాను.

అద్యాపి తా మనిభృతక్రమ మాగతం మాం
ద్వారి ప్రవీక్ష్య శయనే నిమిషేణ సుప్తామ్
మన్దం మయి స్పృశతి కణ్టకితాఙ్గయష్టి
ముత్ఫుల్లగణ్డపులకాం బహుశః స్మరామి.

౧౨౧ అనిభృత క్రమమ్ ఆగతం మాం = రహస్యము గాని రీతిగా బహిరంగముగా వచ్చిన నన్ను, ద్వారి ప్రవీక్ష్య = ద్వారములో చూచి, శయనే నిమిషేణ సుప్తాం = పాన్పునందు నిమిషములో నిద్రపోయినదై (నిద్రించుచున్నట్లు నటించుచున్నదై), మయి మన్దం స్పృశతి (సతి) = నేను మెల్లగా తాఁకఁగా, కణ్టకిత అఙ్గ యష్టిం = గగుర్పాటుచొక్కాకలిగిన చేతికఱ్ఱవంటి దేహము గలదియు (చేతికఱ్ఱవంటి దేహమంతట గగుర్పాటు చొక్కావలె నుండెను), ఉత్ఫుల్ల గణ్డ పులకాం=వికసించిన చెక్కిళ్ల గగుర్పాటు

గలదియు (అయిన), తాం = ఆప్రియను, బహుశః = పలుమాఱు, అద్యాపి, స్మరామి = స్మరించుచున్నాను.

అద్యాపి తాం జఘనదర్శనలాలసేన
క్లృప్తం మయా నివసనాఞ్చల మేకపార్శ్వే
పూర్వోత్థితా మపతితం ముహు రాకృషన్తీం
మన్దాక్షసంకుచితనమ్రముఖీం స్మరామి.

౧౨౩. జఘున దర్శన లాలసేన మయా = కటిపురోభాగమును చూచుటయందు మహాభిలాషగలవాఁడనయిన నాచే, ఏకపార్శ్వే క్లృప్తం నివసన అఞ్చలం = ఒకవైపు లాఁగఁబడిన చీర చెంగును, పూర్వ ఉత్థితామ్=ముందు లేచినదై, అపతితం = పడకుండునట్లు, ముహుః = మాటిమాటికి, ఆకృషన్తీం = లాఁగుచున్నదై, మన్దాక్ష సంకుచిత నమ్ర ముఖీం = సిగ్గుచేత ముణుఁచుకొన్న వంగిన మొగము గలదైన, తామ్, అద్యాపి, స్మరామి = ధ్యానించుచున్నాను.

అద్యాపి తాం విలులితశ్లథకేశపాశా
మీషత్సముస్మిషితఘూర్ణితజిహ్మనేత్రాం
సుప్తోత్థితాం సువదనాం ముహురఙ్గభఙ్గాం
పశ్యామి దష్ట మధరం బహుశః స్పృశన్తీమ్.

౧౨౪. విలులిత శ్లథ కేశపాశాం = విమృదితమై జాఱిన కచభారముగలదియు, ఈషత్ సముస్మిషిత ఘూర్ణిత జిహ్మ నేత్రాం = కొంచెము తెఱవఁబడిన సుడియుచున్న కుటిలములయిన నేత్రములు కలదియు, సుప్త ఉత్థితాం = నిద్రించి మేలుకొన్నదియు, ముహుః అఙ్గభఙ్గాం = పలుమాఱు ఒడలువిఱుపుగలదియు, దష్టమ్ అధరం= కఱవఁబడిన కెమ్మోవిని, బహుశః స్పృశన్తీం = పలుమాఱుతడవుకొనుచున్నదియు నయిన, తామ్, అద్యాపి, పశ్యామి= చూచుచున్నాను.

అద్యాపి తాం సువదనాం వలభౌ నిషణ్ణాం
తద్గేహసన్నిధిగతే మయి దృష్టమాత్రే
నర్మోత్తరం ప్రియసఖీషు కృతస్మితాసు
లజ్జావిలాససహితాం హృది చిన్తయామి.

౧౨౫. వలభౌ నిషణ్ణాం = పంచయందు కూర్చున్నదై, మయి తత్ గేహ సన్నిధి గతే దృష్ట మాత్రే = నేను ఆకాంతయొక్క యింటి సమీపమునకు పోయి అగపడిన మాత్రమున, ప్రియసఖీషు నర్మ ఉత్తరం కృతస్మితాసు = అంతరంగసఖులు పరిహాసవచనములతో నవ్వుచుండఁగా, లజ్జా విలాస సహితా = సిగ్గుయొక్క విలాసముతో కూడుకొన్నదైన, తాం సువదనామ్ = ఆసుముఖిని, అద్యాపి హృది చిన్తయామి = ఇప్పుడును మనస్సులో ధ్యానించుచున్నాను.

అద్యాపి తా మనునయ త్యపి చాటుపూర్వం
కోపాత్ పరాకృతముఖీం మయి సాపరాధే
ఆలిఙ్గితే ప్రసభ ముత్పలకాఙ్గయష్టిం
మా మేతి దుస్సహ మివోక్తవతీం స్మరామి.

౧౨౬. సాపరాధే మయి = తప్పిదముచేసిన నేను, చాటు పూర్వం అనునయతి అపి = ప్రియవచన పూర్వకముగా బతిమాలుకొనుచున్నను, కోపాత్ = కోపముచేత, పరా కృత ముఖీం = అవలికి త్రిప్పఁబడిన ముఖముగలదై, ప్రసభమ్ ఆలిఙ్గితాం = బలత్కారముగా కౌఁగిలించుకోఁబడి, ఉత్పులక అఙ్గయష్టిం = గగుర్పొడిచిన చేతికఱ్ఱవంటి దేహముగలదై, దుస్సహమ్ ఇవ = సహింపరానివానింబోలె (నన్ను), మా మా ఇతి = వలదు వలదు అని, ఉక్తవతీం తామ్ = పలికిన యాకాంతను, అద్యాపి స్మరామి = ఇప్పటికిని స్మరించుచున్నాను.

అద్యాపి తాం సుశయితాం క్షణవిప్రబుద్ధాం
నిద్రాలసాం హృది భజామి కృతాఙ్గభఙ్గాం
జృమ్భావికాసముఖమారుతగన్ధలోభ
నిర్యద్భ్రమద్భ్రమరవిభ్రమలోలనేత్రామ్.

౧౨౭. సుశయితాం = చక్కఁగా నిద్రించినదై, క్షణ విప్రబుద్ధాం = క్షణములో మేల్కొన్నదై, నిద్రా అలసాం = నిద్రచే మత్తుగలదియు, కృత అఙ్గభఙ్గాం = చేయఁబడిన యొడలువిఱుచుట గలదియు (ఒడలు విఱుచుకొనుచున్నదియు), జృమ్భ వికాస ముఖ మారుత గన్ధ లోభ నిర్యత్ భ్రమత్ భ్రమర విభ్రమ లోల నేత్రాం = ఆవులింతచే విరివియైన నోటి వాయువుయొక్క పరిమళమందలి ఆశచే బయలువెడలుచున్న చలించుచున్న తుమ్మెదలవిలాసముగల చంచల నయనములుగలదియు (నైన), తామ్ = ఆచెలువను, అద్యాపి స్మరామి = ఇప్పుడును ధ్యానించుచున్నాను.

అద్యాపి తాం సమనుగమ్య మదాలసాక్షీం
కోఽయం వదేత్యభిహితే బహుశః సఖీభిః
నైనం న విద్మ ఇతి విస్మిత ముల్లపన్తీ
మున్మత్తసాన్ద్రపులకాకులితాం స్మరామి.

౧౨౮. మద అలస అక్షీం = మదముచే మబ్బుగానున్న కన్నులు గలదై, సఖీభిః సమనుగమ్య 'కః అయం వద' ఇతి బహుశః అభిహితే = చెలులు చెంతఁజేరి 'ఎవఁడు ఇతఁడు చెప్పుము' అని పలుమాఱు అడుగఁగా, నైనం న విద్మః ఇతి = వీనిని ఎఱుఁగము అని, విస్మితమ్ = ఆశ్చర్యపడునట్లు, ఉల్లపన్తీం = పలుకుచున్నదై, ఉన్మత్త సాన్ద్ర పులక ఆకులితాం తాం = ధరింపఁబడిన దట్టమైన గగుర్పాటుచే కలంగిన యాకాంతను, అద్యాపి స్మరామి = ఇప్పుడును తలఁచుచున్నాను.

అద్యాపి తాం ప్రథమసంగమజాతలజ్జాం
నిధ్యాయతి వ్యతికరే మయి మన్దధీరం
సీత్కారకమ్పితశిఖాతరళప్రదీప్త
కర్ణోత్పలేన లసతీం సుదతీం స్మరామి.

౧౨౯. ప్రథమ సంగమ జాత లజ్జాం = తొలి కూటమియందు కలిగిన సిగ్గుగలదై, మయి వ్యతికరే మన్ద ధీరం నిధ్యాయతి (సతి)= నేను కూటమిలో (తన్ను) మెల్లగాను ధైర్యముగాను చూచుచుండఁగా, సీత్ కార కమ్పిత శిఖా తరళ ప్రదీప్త కర్ణ ఉత్పలేన = 'సీత్' అను శబ్దముచే (సీత్ అని ఆమె పలుకుటచే) కదలిన అగ్రముగలదై చలించుచున్న ప్రకాశమానమయిన చెవికలువతో, లసతీం తాం సుదతీం = ఒప్పుచున్న ఆ చెలువను, అద్యాపి, స్మరామి = స్మరించుచున్నాను.

అద్యాపి తాం గతినిరాకృతరాజహంసీం
ధమ్మిల్లనిర్జితమయూరకలాపభారాం
చక్షుఃశ్రియా హసితమత్తచకోరనేత్రాం
సంచిన్తయామి కలకణ్ఠసమానకణ్ఠీమ్.

౧౩౦. గతి నిరాకృత రాజహంసీం = నడకచే తిరస్కరింపఁబడిన రాజహంసికలదియు (రాజహంసినడకకన్న అందమయిన నడక కలదియు), ధమ్మిల్ల నిర్జిత మయూర కలాప భారాం = కొప్పుచే గెలువఁబడిన నెమలి పురిమొక్క మొత్తముగలదియు, చక్షుః శ్రియా హసిత మత్త చకోర నేత్రాం = కన్నుల శోభచే పరిహసింపఁబడిన మదించిన వెన్నెలపులుఁగుయొక్క నేత్రములుగలదియు, కలకణ్ఠసమాన కణ్ఠీం = కోకిలతో సమానమయిన కంఠముగలదియు (నైన), తామ్= ఆయామినీ పూర్ణతిలకను, అద్యాపి, సంచిన్తయామి = చక్కఁగా ధ్యానము చేయుచున్నాను.

అద్యాపి తాం మకరకేతనవైజయన్తీ
మన్తర్ముఖే మదధరోష్ఠదళం విధాయ
అఙ్గైః కదమ్బవికచైర్మమ గాఢ మఙ్గ
మాలిఙ్గ్య కేళిశయనే శయితాం స్మరామి.

౧౩౧. ముఖే అన్తః = (తన) నోటి లోపల, మత్ అధర ఓష్ఠ దళం విధాయ = నా క్రింది పెదవి భాగమును ఉంచుకొని, కదమ్బ వికచైః అఙ్గైః = కడపపూవువలె గగుర్పొడిచిన యవయవములతో, మమ అఙ్గం = నా దేహమును, గాఢమ్ ఆలిఙ్గ్య = గట్టిగా కవుంగిలించుకొని, కేళి శయనే శయితాం = క్రీడా శయ్యయందు పరుండియున్న, మకరకేతన వైజయన్తీం = మదనుని జెండాయయిన, తామ్ = ఆ ప్రియను, అద్యాపి స్మరామి = ఇప్పటికిని స్మరించుచున్నాను.

అద్యాపి తా ముపవనే పరిచారయుక్తాం
సంచిన్తయా మ్యుపగతాం మదనోత్సవాయ
మాం పార్శ్వసన్నిహితలోకభయాత్ సుభీతం
వ్యావర్తితేక్షణ మలం సునిరీక్షమాణామ్.

౧౩౨. ఉపవనే = తోఁటలో, పరిచార యుక్తాం = నౌకరులతో కూడుకొని, మదన ఉత్సవాయ ఉపగతాం = కామ పూజకై వచ్చినదై, పార్శ్వ సన్నిహిత లోక భయాత్ = ప్రక్కను ఉన్న జనులవలని భయముచేత, మాం=నన్ను, సుభీతం వ్యావర్తిత ఈక్షణమ్ అలం సు నిరీక్షమాణాం = మిగుల సభయముగా మరల్చిన చూపులతో చక్కఁగా లెస్సఁగా చూచుచున్న, తామ్ = ఆచెలువను, అద్యాపి సంచిన్తయామి = ఇప్పుడును చక్కఁగా ధ్యానించుచున్నాను.

అద్యాపి తా మురసిజద్వయ మున్నమయ్య
నశ్యద్వళిత్రితయదర్శితరోమరాజిం

ధ్యాయామి వేల్లితభుజాం విహితాఙ్గభఙ్గ
వ్యాజేన నాభికుహరం మమ దర్శయన్తీమ్..

౧౩౩. ఉరసిజద్వయమ్ = కుచయుగమును, ఉన్నమయ్య = ఉబికించి, నశ్యత్ వళి త్రితయ దర్శిత రోమరాజిం = పోవుచున్న ముడుతల మూఁటిమొత్తముగలదై (అందుచేతనే)చూపఁబడిన నూఁగారు గలదై (నూఁగారు చూపినదై), వేల్లిత భుజా విహిత అఙ్గ భఙ్గ వ్యాజేన = విదిరింపఁబడిన చేతులతో చేయఁబడిన ఒడ్డలు విఱుచుకొనుట యను వ్యాజముచే (చేతు లల్లార్చుచు ఒడలు విఱుచుకొనుచు ఆమిషచేత), నాభికుహరం మమ దర్శయన్తీం = లోఁతయిన పొక్కిటిని నాకు చూపుచున్న, తామ్ = ఆప్రియను, అద్యాపి ధ్యాయామి = ఇప్పుడును ధ్యానించుచున్నాను.

అద్యాపి తాని మృదుమన్థరభాషితాని
తిర్యగ్వివర్తినయనాన్తనిరీక్షితాని
లీలాలసాఞ్చితగతాని సువిస్మితాని
తస్యాః స్మరామి హృది విభ్రమచేష్టితాని.

౧౩౪. మృదు మన్థర భాషితాని = మృదువయిన మెల్లనయిన మాటలుగలవియు, తిర్యక్ వివర్తి నయన అన్త నిరీక్షితాని = అడ్డముగా తిరిగిన కనుఁగొనల చూపులుగలవియు, లీలా అలస అఞ్చిత గతాని = ఒయ్యారముచే మందమయిన ఒప్పుచున్న నడకగలవియు, సు విస్మితాని = మిక్కిలి ఆశ్చర్యము గలవియు (అయిన), తస్యాః తాని విభ్రమ చేష్టితాని = ఆకాంతయొక్క ఆ విలాసచేష్టలను, అద్యాపి హృది స్మరామి = ఇప్పుడును మనస్సులో ధ్యానించుచున్నాను.

అద్యాపి తాం సురతఘూర్ణితమీలితాక్షీం
స్రస్తాఙ్గయష్టిగళితాకులకేశపాశామ్

తన్వీం కురఙ్గనయనాం సురతైకపాత్రీం
తాం రాజహంసగమనాం మనసా స్మరామి.

౧౩౫. సురత ఘూర్ణిత మీలిత అక్షీం=క్రీడచే సుడిసిన మూయఁ బడిన కన్నులుగలదియు, స్రస్త అగ్ర యష్టి గళిత ఆకుల కేశ పాశాం=వదలినవియు చేతికఱ్ఱవంటి దేహముమీఁదికి జాఱినవియు చెదరినవియు నయిన తలవెండ్రుకల మొత్తముగలదియు, తన్వీం = సన్నదియు, కురఙ్గ నయనాం = లేడికన్నులుగలదియు, సురత ఏకపాత్రీం = క్రీడకు ముఖ్యముగా అర్హురాలును, మత్త ఇభ రాజ గమనాం = మదించిన శ్రేష్ఠమయిన యేనుఁగుయొక్క నడకవంటి నడకగలదియు, (అయిన), తామ్ = ఆప్రియను, అద్యాపి మనసా స్మరామి=ఇప్పుడును మనస్సులో స్మరించుచున్నాను.

అద్యాపి తా మలసమీలితచారునేత్రాం
లోలద్భుజావలయకన్ధర మావహన్తీమ్
వల్గత్కపోలభుజ మున్నమితభ్రు కర్ణే
కణ్డూయనం విదధతీం హృది చిన్తయామి.

౧౩౬. అలస మీలిత చారు నేత్రాం = మందమయిన మూయఁ బడిన అందమయిన కన్నులుగలదియు, లోలత్ భుజా వలయ కన్ధరమ్ = చలించుచున్న చేతికడియములు మెడయు, ఆవహన్తీం = కలిగినదై, వల్గత్ కపోల భుజం=చలించుచున్న చెక్కిలియు బాహువునుగలుగునట్లును, ఉన్నమిత భ్రు = ఎత్తఁబడిన బొమలుగలుగునట్లును, కర్ణే = చెవియందు, కణ్డూయనం విదధతీం=గోఁకుకొనుటను చేయుచున్న (గోఁకుకొనుచున్న), తామ్=ఆయువతిని, అద్యాపి హృది చిన్తయామి = ఇప్పుడును మనస్సులో తలంచుచున్నాను.

అద్యాపి తా మవహితో మన సాచలేన
సంచిన్తయామి రమణీం మమ జీవితేశామ్

నాన్యోపభుక్త నవయౌవనభారసారాం
జన్మాన్తరేఽపి న మయా వియుతిర్యథా స్యాత్.

౧౩౭. మమ జీవిత ఈశాం = నా ప్రాణ నాయికయయిన, తాం రమణీం = ఆ సుందరిని, న అన్య ఉపభుక్త నవయౌవనభార సారాం = ఇతరులచే అనుభవింపఁబడినది గాని క్రొత్తయౌవనము యొక్క అతిశయము యొక్క సారముగల దానిని, జన్మాన్తరే అపి = మఱియొక జన్మమం దయినను, మయా వియుతిః యథా న స్యాత్ = నాతో వియోగము ఎట్లు కలుఁగదో (కలుగకుండు నట్లు), అవహితః = శ్రద్ధగలవాఁడనై, అచలేన మనసా = చలింపని మనస్సుతో, అద్యాపి సంచిన్తయామి=ఇప్పుడును ధ్యానము చేయుచున్నాను.

అద్యాపి తత్ ప్రణయభఙ్గుర దృష్టిపాతం
తస్యాః స్మరామి రతివిభ్రమపత్త్రిభఙ్గం
వక్త్రం కరస్థగితచారుపయోధరం చ
దన్తచ్ఛదం దశనమణ్డలఖణ్డితం చ.

౧౩౮. తస్యాః=ఆమెయొక్క, ప్రణయ భఙ్గుర దృష్టి పాతం = అనురాగముచే వంకరయయిన చూపులు నిగిడించుటకలదియు, రతి విభ్రమ పత్త్రి భఙ్గం = క్రీడా విలాసములచే నయిన మకరికాదిపత్త్రి ముల కలఁగిపోవుటకలదియు, (అయిన), తత్ వక్త్రం=ఆ ముఖమును, కర స్థగిత చారు పయోధరం చ=చేతులచే ఆవరింపఁబడిన అంద మయిన కుచమును, దశన మణ్డల ఖణ్డితం = పలు వరుసచే కొఱుకఁ బడిన, దన్తచ్ఛదం=కెమ్మోవిని, అద్యాపి స్మరామి=ఇప్పుడును తలంచు చున్నాను.

అద్యాపి తాం గళితబన్ధనకేశపాశ
స్రస్తస్రజం స్మితముఖీం వరకమ్బుకణ్ఠీమ్

పీనోన్నత స్తనయుగోపరి చారుచఞ్చ
న్ముక్తావళీం సురతతాన్తముఖీం స్మరామి.

౧౩౯. గళిత బన్ధన కేశ పాశ స్రస్త స్రజం=వీడిన ముడిగల తల వెండ్రుకల మొత్తమునుండి రాలిన పూదండగలదియు, స్మితముఖీం= నవ్వుగల మొగముగలదియు, వర కమ్బు కణ్ఠీం = ఉత్తమమయిన శంఖమువంటి కంఠముగలదియు, పీన ఉన్నత స్తన యుగ ఉపరి చారు చఞ్చత్ ముక్తా ఆవళీం=వలుద నిక్కు చను దోయి మీఁద అందమయిన కదలుచున్న ముత్యాల పేర్లుగలదియు, సురత తాన్త ముఖీం = మదనకేళిచే వాడిన ముఖముగలదియు (అయిన), తామ్=ఆకాంతను, అద్యాపి స్మరామి=ఇప్పుడును తలంచుచున్నాను.

అద్యాపి తాం సురతజాగరఘూర్ణమాన
తిర్యగ్వివృత్తతరళాయతతారకాక్షీం
శృఙ్గారసారకమలాకరరాజహంసీం
వ్రీడావినమ్రవదనాం మనసా స్మరామి.

౧౪౦. సురత జాగర ఘూర్ణమాన తిర్యక్ వివృత్త తరళ ఆయత తారకా అక్షీం = మదనకేళిచేత మేల్కొనుటచే సుడియుచున్న అడ్డముగా తిరిగిన చంచలములయిన విశాలములయిన నల్లగ్రుడ్లుగల నేత్రములుగలదానిని, శృఙ్గార సార కమలాకర రాజహంసీం=శృంగారముయొక్క స్థిరాంశమనెడు సరస్సునందలి రాజమరాళిని, వ్రీడా వినమ్ర వదనాం = సిగ్గుచే వంగిన ముఖముగలదానిని, తామ్ = ఆయామినీపూర్ణతిలకను, అద్యాపి స్మరామి=ఇప్పుడును స్మరించెదను.

అద్యాపి తాం సురతతాణ్డవసూత్రధారీం
పూర్ణేన్దుసున్దరముఖీం మదవిహ్వలాఙ్గీమ్
తన్వీం విశాలనయనాం స్తనభారఖిన్నాం
వ్యాలోలనీవివసనాం మనసా స్మరామి.

౧౮౧. సురత తాణ్డవ సూత్రధారీం = కామకేళి యనెడి యుద్ధతనాట్యమునకు సూత్రధారిని, పూర్ణ ఇన్దు సున్దర ముఖీం = నిండు చందురునివలె అందమయిన ముఖముగలదానిని, మద విహ్వాల అఙ్గీం = మదముచే పరవశమయిన దేహముగలదానిని, తన్వీం=సన్నని దానిని, విశాలనయనాం = వెడల్పయిన నేత్రములు గలదానిని, స్తన భార ఖిన్నాం = కుచముల బరువుచే ఆయాసపడుదానిని, వ్యాలోల నీవి వసనాం = చెదరుచున్న పోఁకముడిగల . వస్త్రముగల దానిని, తామ్ = ఆప్రియను, అద్యాపి మనసా స్మరామి=ఇప్పుడును మనస్సులో ధ్యానించెను.

అద్యాపి మద్ధృదయపఙ్కజలీనభృఙ్గ్యా
మూర్ఛావిగర్హితవిలోచనయా మృగాక్ష్యా
వేధాః కరోతు కృపయా జననాన్తరేఽపి
సంత్యక్తమన్యు రవిరోధ మితి స్మరామి.

౧౮౨ మత్ హృదయ పఙ్కజ లీన భృఙ్గ్యా = నాహృదయ మను కమలములో అడఁగిన తేఁటియు, మూర్ఛా విగర్హిత విలోచన యా = మూర్ఛచే విచేష్టితములయిన నేత్రములుగలదియు, మృగ అక్ష్యా = లేడికన్నులవంటి కన్నులుగలదియు, (అయిన యాచెలితో, నాకు), వేధాః = బ్రహ్మదేవుఁడు, సంత్యక్త మన్యుః = వదలఁబడిన కోపముకలవాఁడై (కోపము మాని), కృపయా = దయచే, జన నాన్తరే అపి=వేఱుజన్మమం దయినను, అవిరోధం కరోతు = మేలును చేయునుగాక, ఇతి అద్యాపి స్మరామి = అని యిప్పుడును ధ్యానించుచున్నాను.

అద్యాపి తాం స్మితముఖీం చ మమాఙ్గలగ్నాం
ప్రౌఢప్రతాపమదనానలతప్తగాత్రీం
బాలాం తదాత్వవివశా మనుకమ్పనీయాం
ప్రాణా దపి ప్రియతమాం మనసా స్మరామి..

౧౪౩. ప్రౌఢ ప్రతాప మదన అనల తప్త గాత్రీం = గాఢమైన వేడిగల మదనుని నిప్పుచే తపింపఁబడిన దేహముగలదై, మమ అఙ్గలగ్నాం = నా దేహమందు అంటుకొన్నదై, స్మితముఖీం చ=నవ్వు మొగముగలదియు నైన, తాం బాలాం=ఆయువతిని, తదాత్వవివశాం = ఆకాలమున పరవశురాలైయున్నదానిని, అనుకమ్పనీయాం = కనికరింపఁదగినదానిని, ప్రాణాత్ అపి ప్రియతమామ్ = ప్రాణముకంటెను ప్రియమయినదానిని, అద్యాపి మనసా స్మరామి= ఇప్పుడును మనస్సులో ధ్యానించెను.

అద్యాపి తాం న న న నే త్యుదితం మదీయం
శ్రుత్వైవ భీతహరిణీమివ చఞ్చలాక్షీమ్ ·
వామస్ఖలద్విసరదశ్రుజలాయతాక్షీం
తాం చిన్తయామి సురతే వినియుక్తగాత్రీమ్.

౧౪౪. సురతే వినియుక్తగాత్రీం = కామకేళియందు వినియోగింపఁబడినదేహముగలదై, న న న న ఇతి మదీయమ్ ఉదితం శ్రుత్వాఏవ =వలదు వలదు అను నా పలుకు విన్నమాత్రమున, భీత హరిణీమ్ ఇవ చఞ్చల అక్షీం = బెదరిన లేడివలె చంచలములయిన నేత్రములు గలదానిని, వామ స్ఖలత్ విసరత్ అశ్రు జల ఆయత అక్షీం = అందముగా జాఱుచున్న వ్యాపించుచున్న బాష్పజలముగల విశాలనేత్రములు గలదానిని, తామ్ అద్యాపి స్మరామి=ఆరమణిని ఇప్పుడును ధ్యానించుచున్నాను.

అద్యాపి తద్వదనపఙ్కజగన్ధలోభ
భ్రామ్యద్విరేఫచయచుమ్బనఝఙ్కృతేషు
క్లేశావధూతకరపల్లవకఙ్కణానాం
క్వాణం చ సమ్ప్రతి కలం హృది చిన్తయామి.

౧౪౫. తత్ వదన పఙ్కజ గన్ధ లోభ భ్రామ్యత్ ద్విరేఫ చయ చుమ్బన ఝఙ్కృతేషు = ఆకాంత ముఖ కమలముయొక్క పరిమళ

మందలి ఆశచేత ఎగురుచున్న తుమ్మెదల గుంపుయొక్క నోటితో తాఁకుటయందలి ఝుంకారములయందు, క్లేశ అవధూత కరపల్లవ కఙ్కణానాం = నెప్పిచేత జాడింపఁబడిన కేలుచిగురులయొక్క కడియములయొక్క, కలం క్వాణం = మధురమయిన నాదమును, హృది అద్యాపి చిన్తయామి = మనస్సులో ఇప్పుడును ధ్యానించుచున్నాను.

అద్యాపి నోజ్ఝతి హరః కిల కాలకూటం
కూర్మో బిభర్తి ధరణీం ఖలు పృష్ఠభాగే
అమ్భోనిధి ర్వహతి దుస్సహబాడబాగ్ని;
మఙ్గీకృతం సుకృతినః పరిపాలయన్తి.

౧౪౯. అద్యాపి = ఇప్పటికిని, హరః కాలకూటం న ఉజ్ఝతి = శివుఁడు కాలకూటవిషమును వదలఁడు, కూర్మః ధరణీం పృష్ఠ భాగే బిభర్తి ఖలు = ఆదికూర్మము భూమిని వీఁపు ప్రదేశమున మోచుచున్నాఁడు గదా, అమ్భోనిధిః దుస్సహ బాడబ అగ్నిం వహతి=సముద్రుఁడు భరింపరానిదైన బడబానలమును భరించుచున్నాఁడు; సుకృతినః అఙ్గీకృతం పరిపాలయన్తి = పుణ్యవంతులు ఒప్పుకొన్నదానిని నెఱవేర్తురు.

నేను ఆకాంత యనురాగమును అంగీకరించితిని, కనుక దానిని వదలను అని భా.

ఓయి కోటిపాలుఁడా! నీవు నన్ను చంప నొప్పుకొంటివి, ఆకృత్యము ఎట్టిదైనను నీవు యోగ్యుఁడవేని చేసితీరవలసినది, అనియు భావము కావచ్చును.

పఞ్చత్వం తను రేతు, భూతనివహో
స్వాంశా మిళన్తు ధ్రువం,
ధాత, స్త్వాం, ప్రణిపత్య సాదర మిదం
యాచే నిబద్ధాఞ్జలిః—

తద్వాపీషు పయ స్తదీయముకురే
　జ్యోతి సదీయాఙ్గణే
వ్యోమ స్యా చ్చ తదీయవర్త్మని ధరా
　తత్తాళవృన్తేఽనిలః.

౧౪౭. తనుః = నాదేహము, పఞ్చత్వమ్ ఏతు = చావును పొందునుగాక, భూత నివహే = భూతముల సమూహమందు స్వ అంశాః = దాని దానియంశములు, మిళన్తు=చేరును గాక, (నాదేహ మందలి పంచభూతములభాగములు తమతమ మహాభూతములయందు ఐక్యమైపోవును గాక. ఇది లోకములో సహజము. ఇందులకై వగవను, మఱియేమనిన—), ధాతః = ఓబ్రహ్మదేవుఁడా, త్వాం ప్రణిపత్య నిబద్ధ అఞ్జలిః (సన్) ఇదం సాదరం యాచే = నీకు ప్రణమిల్లి మోడ్చిన కేలుదోయిగలవాఁడ (నై) దీనిని యాదరముతో యాచించు చున్నాను, (దేనిననఁగా), పయః =(నాదేహమందలి) జలము, తత్ వాపీషు= (మఱియొక్కడి జలమందైనను గలియక) ఆకాంతయొక్క (ఆకాంతస్నానమాడు) బావులయందును, జ్యోతిః=నాతేజస్సు, తదీయ ముకురే = ఆచెలువదయిన యద్దములోను, వ్యోమ=(నా)యాకాశము, తదీయ అఙ్గణే = ఆరమణి ముంగిటియందును, ధరా = (నా) పృథివి తదీయ వర్త్మని = ఆకాంత దయిన (ఆచెలువనడుచు) దారి యందును, చ = అట్లే, అనిలః=(నా) వాయువు, తత్ తాలవృన్తే= ఆరమణియొక్క విసనకఱ్ఱయందును, స్యాత్ = ఉండును గాక.

ఇ త్యేవం వర్ణినం ప్రాజ్ఞం
కవిం దృష్ట్వా నతాననాః
తూర్ణం గత్వా నరేశం త
మూచుః సర్వేఽపి సాదరమ్.

౧౪౮. అని యీరీతిని వర్ణించుచున్న విద్వాంసుఁడైన కవినిచూచి మొగములు వాంచినవారై త్వరగా పోయి ఆరాజుతో అందఱును ఆదరముతో (ఇట్లు) పలికిరి.

'ప్రసాదయ కవీన్ద్రం తం
సందర్శయ చ కౌతుకమ్.'
శ్రుత్వా వాక్యం నృప స్తేషాం
కవి మానాయయ ద్ద్రుతమ్.

౧౪౯. జనులు— తం కవీన్ద్రం ప్రసాదయ=ఆ కవిశ్రేష్ఠుని ప్రసన్నునింజేసికొనుము, కించ=మఱియు, కౌతుకం సందర్శయ=(అతనికి) సంతోషమును చూపుము (నీవు సంతోషించినట్లు అతనికి తెలుపుము). నృపః తేషాం వాక్యం శ్రుత్వా ద్రుతం కవిమ్ ఆనాయయత్ = రాజు వారి మాటను విని త్వరగా కవిని పిలిపించెను.

పరిరభ్య కవిం తస్మై వహ్ని సాక్షి నిజాత్మజామ్
సంప్రదాయ వివాహం చ కారయామాస భూపతిః.

౧౫౦. భూపతిః కవిం పరిరభ్య తస్మై నిజ ఆత్మజాం వహ్ని సాక్షి సంప్రదాయ చ వివాహం కారయామాస = రాజు కవిని కవుంగిలించుకొని అతనికి తన కొమారితను అగ్ని సాక్షికముగా ఇచ్చియు పెండ్లి చేయించెను.

పూర్వార్ధ ఏవ తద్రాత్రౌ రన్తుకామం పతిం ప్రతి
ఉవాచ కామసంతప్తం రాజపుత్రీ ప్రమోదతః.

౧౫౧. కామ సంతప్తం = మదనునిచే మిక్కిలి తపింపఁబడినవాండై, తత్ రాత్రౌ=ఆ రాత్రియందు పూర్వ అర్ధే ఏవ=తొలి సగమందే, రన్తు కామం = క్రీడింపఁగోరిన, పతిం ప్రతి = భర్తతో, రాజపుత్రీ ప్రమోదతః ఉవాచ = రాజకన్య సంతోషముతో (ఇట్లు) అనెను.

జాగర్తి లోకో జ్వలతి ప్రదీపః,
సఖీజనః పశ్యతి, కౌతుకేన

ముహూర్తమాత్రం కురు కాన్త ధైర్యం
బుభుక్షితః కిం ద్వికరేణ భుఙ్క్తే?

౧౫౨. లోకః జాగర్తి = జనులు మేలుకొనియున్నారు, ప్రదీపః జ్వలతి = దీపము వెలుఁగుచున్నది, సఖీజనః కౌతుకేన పశ్యతి = చెలులు కౌతూహలముతో చూచుచున్నారు, కాన్త = ప్రియుఁడా, ముహూర్తమాత్రం = గంటసేపు మాత్రము, ధైర్యం కురు = ఓర్పు గలిగియుండుము, బుభుక్షితః ద్వికరేణ భుఙ్క్తే కిమ్ = ఆఁకలిగొన్న వాఁడు రెండుచేతుల భుజించునా ఏమి?

తతః స రాజా తనయా కవిశ్చ
లక్ష్మీనివాసే నగరే సితాన్తమ్
సుఖేన రాజ్యం పరిపాలయన్తో
లక్ష్మీపతేర్దివ్యదృశా ననన్దుః.

౧౫౩. పిమ్మట రాజు కొమారిత కవి యు సిరికి ఇల్లయిన (గా) నగరమందు మిక్కిలి సుఖముగా రాజ్యమును ఏలుచు లక్ష్మీపతియొక్క ఉత్కృష్టమయిన చూపుచేత సంతోషించిరి.

సంపూర్ణము.





పదటీకా తాత్పర్య పదప్రయోజనాదులు. 264పు.2 రు.

7 విక్రమార్కచరిత్ర.— తెనుఁగున టిప్పణము. 12 అ.

8 భోజచరిత్ర.— తె. టిప్పణము 8 అ.

☞ ఇదే టిప్పణము విపులతరము. 12 అ.

9 బిల్హణచరిత్ర.-సరసప్రబంధము. సంపూర్ణాంధ్రటీక. 6అ.

10 పుష్పబాణవిలాసము — సంస్కృతవ్యాఖ్య, తెనుఁగున సంపూర్ణటీక. ... ... 8 అ.

11 రసమంజరి -శృంగార విస్తరము. తె సం టీక. 12 అ.

12 ప్రియదర్శికానాటిక.—శ్రీహర్షకృతి. సం టిప్పణము. తె. సంపూర్ణటీక. ఆంధ్రీకరణ సమేతము. 1 రు.

13 శబ్దమంజరీ సమాసకుసుమావళీ తిఙంతమంజరులు.— తెనుఁగున వివరణము సయితము. 4 అ

## 14 కుమారసంభవము:—

ఆఱు సర్గలు. ఇది మల్లినాథకృత సంస్కృత వ్యాఖ్యతోను, మద్విరచిత ప్రతిపద టీకా తాత్పర్యాది సంపూర్ణాంధ్ర వ్యాఖ్యతోను ఎల్లవారును స్వయముగా పఠించి సంస్కృతమందు సాహిత్య మలవరించుకొనుటకును మహాకవిహృదయము నెఱుంగుటకును ఉత్తమసాధనముగా మిక్కిలి శ్రద్ధతో ముద్రింపఁబడినది. . 2 రు.

## ఆంధ్రగ్రంథములు.

1 ప్రియదర్శికానాటిక.—వత్సరాజాంతఃపుర రసవత్తర చరిత్ర, సతాత్పర్యము. ... ... 6 అ.

2 ఉషానాటకము.—అనిరుద్ధుఁడును ఉషయు కలలో వివాహమాడుట లోనగు నద్భుతకథ. 8 అ.

3 శాకుంతలనాటకము.-కాళిదాసకృతికి తెనుఁగు 12అ.

4 ప్రతాపరుద్రీయనాటకము.—యుగంధరుఁడు ఓరుఁగంటి ప్రతాపరుద్రుని ఢిల్లీలో చెఱ విడిపించి ఢిల్లీ సుల్తానును ఓరుఁగంటికి ఖైదుగొనిపోవుట. సటిప్పణము. 1 రు.

5 నాగానందనాటకము.—సటిప్పణము 8. అ.

6 నీచపాత్రగ్రామ్యభాషాప్రయోగనిబంధనము.— 8 అ.

7 ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శము.- జయదేవకృత సంస్కృతమూల స్వారస్యవివరణసమేతము.345పు 2రు.

8 కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దనకృతి.1రు.

9 పారిజాతాపహరణము.-4అ. పెద్దయక్షరములది 8 అ.

10 కథాసరిత్సాగరము.—సులభ వచనగ్రంథము. అత్యద్భుత నీతి వ్యవహార కథలు. 1902-పు 4 రు.

☞ ఇదే పూర్వభాగము. రు. 2-2 అ.

ఉత్తరభాగము రు. 2-2 అ.

11 జ్ఞానవాసిష్ఠరామాయణము.—పద్యకావ్యము. 1 రు.

## 12 సారంగధరచరిత్రము:—

పుణ్యావిశేషలబ్ధ మృదు మధుర సరసవాగ్వైభవంబున చేమకూర వేంకటపతి అమృతపుఁ గూరగా రచించిన యీభవ్య ప్రబంధము, సాహసిక ముద్రణములపాలై ఈవిరివియ పూదండ చెత్తత్రొట్టింబడిన కరణిం బురణించుచుండుం గని, బాగుపఱిచి సటీకముగా ప్రకటించినాఁడ. పూమొగ్గలు ప్రూలె తామే విశ్లేషలును, ద్రాక్షాపాకంబున నోరూర రసముల్కు రచనలును, విసివింపనివర్ణనలును, బరువులు నెరువులుం గాని తోడవులును, దీనిని అమృతీకరించినవి. 1 రు.

## 13 విజయవిలాసము:—

చేమకూర వేంకటపతి ప్రణీతపద్యకావ్యము లందును లోని లిబ్బివలె రసికులకు అబ్బియు నబ్బని యర్థములచే నబ్బుర మొసంగుచు, కాకలీగీతముంబోలె మధురంబయ్యు నస్ఫుటంబై రసికగోష్ఠులయందు సంచహాంతచర్యలకుం గారణంబైన కాకిమొలకువలలో నిండి సంపూర్ణానుభవమునకురాక యున్నట్టి యీం సొత్తం ప్రబంధము ఎల్లవారికిని సుబోధం బగునట్లు మద్విరచిత విపుల వ్యాఖ్యానముతోఁ బ్రకటింపఁబడినది. 1రు.